# జీవన గీతం

## ఖలీల్ గిబ్రాన్

### అనువాదం : కె. సురేష్

మంచి పుస్తకం

THE PROPHET by Khaleel Gibran

**జీవన గీతం - ఖలీల్ గిబ్రాన్**

మొదటి ముద్రణ,
హైదరాబాద్ బుక్ ట్రస్ట్ : మార్చి, 2002

మంచి పుస్తకం
మొదటి ముద్రణ : ఆగస్టు, 2011

ప్రతుల సంఖ్య : 2000

**వెల** : రూ. 30/-

**ISBN** : 978-93-80153-54-4

ప్రతులకు:

**మంచి పుస్తకం**

12-13-439, వీధి నెం. 1
తార్నాక, సికింద్రాబాదు - 500 017.
ఫోన్ : 94907 46614
email : info@manchipustakam.in
web : www.manchipustakam.in

కంపోజింగ్, లే అవుట్ : పద్మ
ముఖచిత్ర డిజైన్ : చరిత ఇంప్రెషన్స్

**ముద్రణ :** చరిత ఇంప్రెషన్స్
1-9-1126/బి,
అజామాబాద్, హైదరాబాదు,
ఫోన్: 2767 8411.

# పరిచయం

1953లో 'నా గొడవ' రెండవ ముద్రణ జరుగుతున్నప్పుడు 'ఖలీల్ గిబ్రాన్' పుస్తకం 'ది ప్రాఫెట్' నా చేతికి వచ్చింది. మిత్రుడు ఏల్చూరి సుబ్రహ్మణ్యం ఇచ్చిండు ఆ పుస్తకం. ఎన్నిసార్లు చదివిన్నో. అనువాదం చేయటానికి ఎక్కువ సమయం పట్టలేదు. దాన్ని నేను అర్థం చేసుకున్నంత మట్టుకు, మూలంలోని భావం మారకుండా వ్యాఖ్యానం మాదిరి అనువాదం చేసిన. ఇంగ్లీషుల ఉన్నంత క్లుప్తత తేవటానికి నా వశం కాలే. అప్పటికే ఉన్న ఉర్దూ, మరాఠీ, అరబ్బీ అనువాదాలన్నిటిని చదివిన. ఖలీల్ గిబ్రాన్ గురించీ చదివిన. నేను పోయిన అన్ని చోట్లా చదివి వినిపించి, ఎంతోమందికి చూపించి అభిప్రాయం అడిగిన. కొంతమంది విషయంతో ఏకీభవించలేదు. అనువాదం వినిపించినప్పుడు ఏమీ అనని వాండ్లు పుస్తకం అచ్చయినాంక, అదీ రాచమల్లు రామచంద్రారెడ్డి విమర్శ రాసిన తర్వాత వ్యాఖ్యానించటం మొదలుపెట్టింద్రు. విమర్శకు ముందు రామచంద్రారెడ్డి ఇంగ్లీషు అనువాదం ప్రతి వాక్యం చదివిండు. ఆయన విమర్శను ఖండించవలసిన అవసరం కానీ, నా అనువాదాన్ని సమర్థించుకోవలసిన అవసరం కానీ లేవు. విచారకరమయిన విషయమేమిటంటే, చాలామంది ఏమీ చదవకుండానే అభిప్రాయాలు ఏర్పరచుకుంటరు. కాళిదాసును చదవకుండానే అభిప్రాయాలు ఏర్పరచుకుంటరు. కాళిదాసును చదవకుండానే "ఆహా! కాళిదాసు," అంటరు. ఇది అసలు ట్రాజడీ.

"నేను కమ్యూనిస్టు వలె చెప్తున్న,", "నేను సోషలిస్టుగా మాట్లాడుతున్న,", "నేను హిందువుగ ఈ విషయం చెప్తున్న," అంటరుగానీ మరి మనిషివలె ఆలోచించేదెప్పుడు అనేది నా ప్రశ్న.

‘డాక్టర్’ అంటే పలుకుతరు. ‘వకీల్’ అంటే పలుకుతరు. ‘కవీ’ అంటే పలుకుతరు. కానీ ‘మనిషి’ అంటే “మనిషంటవ్,” అని కోపానికస్తరు.

‘మేం దీనికి వ్యతిరేకం’, ‘దానికి వ్యతిరేకం’ అని ఎన్నిటినో వ్యతిరేకిస్తరు. కానీ, దేనికోసం నిలబడుతరు? మనం విభేదించే విషయాలల్ల చాల పట్టుదలగ ఉంటంకానీ దేన్నీ అంగీకరిస్తమో చెప్పం, పట్టించుకోం. సిద్ధాంతానికీ, ఆచరణాత్మక జీవితానికీ సంబంధం కనబడటం లేదు.

‘నీకూ, నాకూ, వానికి
నీతుల్లో ఉన్న తేడ
కూతల్లో ఉన్న తేడ
చేతల్లో కనబడదేం’ (నా గొడవ)

తెలుగుల మనకు మూడు పదాలున్నయి. నా, మా, మన అని. నా దృష్టిల నా అంటే ప్రాణి ధర్మం – నేను అనే. మా అంటే కుటుంబం, కులం అట్లాటివి. మా కుటుంబం, మా కులం, ఇట్ల. ‘మనం’ అన్నది అందరికి చెందింది. అంతిమంగ ‘మనం’ అన్నది రావాలి.

నేను ఇంకా ‘నా’ నుండి ‘మా’ వరకే రాలేదు.
మన అన్నపుడు గదా ముందడుగు (నా గొడవ)

బతుకు రెండు విధాలు. సంగడి బతుకు. అంగడి బతుకు. సంగడి అంటే స్నేహం, మైత్రి. అంగడి అంటే బజారు, వ్యాపారం జరిగేచోటు. బజారుల అన్ని సంఘర్షణలు, వైరుధ్యాలు, అంతా వ్యాపారం. ‘సంగడి’ బతుకులో అంతా స్నేహం. అందుకని నేననేదేమిడిదంటే సంగడి బతుకు కావాలె, అంగడి బతుకుకాదు.

సంతసముగ జీవింపగ
సతతము యత్నింతు గాని
ఎంతటి సౌఖ్యానికైన
ఇతరుల పీడింపబోను (నా గొడవ)

'ది ప్రాఫెట్' మొదటి అధ్యాయం, చివర అధ్యాయం మధ్య ఇరవై ఎనిమిది ప్రశ్నలున్నాయి. అన్నీ జీవితానికి సంబంధించినవే. పిల్లల గురించి, ఇండ్ల గురించి, పెండ్లి గురించి, పని గురించి ... ఇట్లా ...

భక్త తుకారాం తన భజనలో అంటడు – ఏ జీవినీ తప్పు పట్టకు. ప్రతి ఒక్కడూ ఏదో పని చేస్తున్నడు. పని దేవునితో సమానం అని. గిబ్రాన్, ప్రేమతో పనిచేయి, ఏహ్యతతో కాదు అంటడు. పని ద్వారా ప్రేమ ప్రకటిత మవుతుంది అంటడు. ఏ పని చేసినా నీకు ప్రాణప్రదమైన వ్యక్తికోసం చేస్తున్నట్లు చెయ్యమంటడు.

'నేరం – శిక్ష' గురించి మాట్లాడినప్పుడు, "చెట్టు అంతటికీ ఎరుక లేకుండా ఒక్క ఆకు కూడా పండుబారనట్లే, మీ అందరి రహస్య సమ్మతి లేకుండా ఏ ఒక్కడూ తప్పు చెయ్యలేడు," అంటడు.

గాంధీని చంపింది గాడ్సే ఒక్కడే కాదు. ఆయన ఆలోచనలతోటి ఏకీభవించనివాండ్లు ఆయన పార్టీలోనే కాక ఆయన అనుచరుల్లో, ప్రభుత్వంలో ఎంతోమంది ఉన్నరు. దేశ విభజన తర్వాత, తేలిన లెక్కల ప్రకారం పాకిస్తాన్ ఇండియాకు 220 కోట్లు, భారత్ పాకిస్తాన్‌కు 55 కోట్లు ఇవ్వవలసి ఉండె. పాకిస్తాన్‌ను మనకివ్వవలసిన 220 కోట్లలో ఆ 55 కోట్లు జమ పట్టుకోమని అంటే గాంధీజీ ఒప్పుకోకుండా, పాకిస్తాన్ పేద దేశం, 55 కోట్ల ధనం ఇవ్వవలసిందే అని పట్టుపట్టిండు. ఆ డబ్బు ఇచ్చిన తర్వాత పటేల్ ఇట్ల అన్నడు – "We are giving these 55 crores to Pakistan to save Bapu from some mental agony. Inspite of this Pakistan remains same - then - fate, fate, fate."

స్నేహం గురించి గిబ్రాన్ చెప్పినప్పుడు, నీ అవసరాల సమాధానమే నీ స్నేహితుడంటడు. అక్కర ఏర్పడంగనే తెలిసేది స్నేహితునికీ, దేవునికీ మధ్య తేడా. చెలిమి గురించి రాసిన గేయంలో 'నా గొడవ'లో రాసిన

'అక్కరలు దీర్చమని అడగనక్కరలేదు
అడిగినను అయ్యదియు యాచనసలే కాదు
అడగకయె పొందినను అపచారము కాదు' అని.

ఈ గేయం విన్నాంకనే ఏల్చూరి గిబ్రాన్‌ను బాగా చదివినట్లున్నవు అన్నడు. అప్పటికి గిబ్రాన్ రచనలేవీ నేను చదవలేదు. ఆ మాటే అన్న ఏల్చూరితో. అప్పుడే, తన దగ్గరి "The Prophet" నాకిచ్చిండు.

ప్రాఫెట్ ఎన్నిసార్లు చదివిన్నంటే, నా అనువాదం మోస్తరే అందులోని ప్రతివాక్యం గుర్తున్నది. గిబ్రాన్ ప్రతి విషయం గురించి చాలా లోతుగా, ఎంతో ఆధునికంగా చెప్పిండు. 'బతుకు పుస్తకం' అని అందుకే నేను పేరు పెట్తే, శశాంక దాన్ని 'జీవన గీత' అని మార్చిండు.

చట్టం తప్పుతుంది, మతం తప్పుతుంది, ప్రభుత్వం తప్పుతుంది, న్యాయం తప్పుతుంది కాని బతుకు తప్పదు. బతక్క తప్పదు: బతుక్కు సంబంధించిన పుస్తకం కనుకనే ఇప్పటికీ కొత్తగానే ఉంటుంది. ఖలీల్ గిబ్రాన్ మహానుభావుడు.

నక్కలగుట్ట **కాళోజి నారాయణరావు**
18-1-02

అతడు అల్ ముస్తఫా. ఎంపిక చేయబడినవాడు. అందరికీ ప్రీతిపాత్రుడు. తన రోజుకి అతడే తొలి సంధ్య. తాను పుట్టిన దీవికి తిరిగి తీసుకెళ్ళే ఓడకోసం ఆర్ఫలీస్ నగరంలో పన్నెండు సంవత్సరాలు వేచి ఉన్నాడు.

పన్నెండో సంవత్సరంలో, కోతల నెలలో ఏడో రోజున నగరం గోడలు దాటి కొండనెక్కి సముద్ర దిశగా చూశాడు. మంచు తెరలలోనుంచి వస్తున్న తన ఓడ కనపడింది.

అతడి హృదయపు తలుపులు తెరుచుకుని, ఆనందం సముద్రం మీద ఎంతో దూరం ప్రవహించింది. కళ్ళు మూసుకుని తన ఆత్మ నిశ్శబ్దాలలో ప్రార్థన చేశాడు.

కొండదిగి వస్తుండగా విచారం అతడిని కమ్ముకుంది. తన హృదయంలో ఇలా అనుకున్నాడు:

ప్రశాంతంగా, దుఃఖం లేకుండా ఎలా వెళ్లగలను? లేదు, ఆత్మ గాయపడకుండా ఈ నగరం విడిచి వెళ్లలేను.

ఈ నగరం గోడల మధ్య బాధతో సుదీర్ఘ రోజులు గడిపాను,

ఒంటరిగా సుదీర్ఘ రాత్రుళ్లు గడిపాను. తన బాధనుండి, ఒంటరితనంనుంచి ఎవరు మాత్రం విచారించకుండా వెళ్లగలరు?

ఈ వీధులలో నా ఆత్మ తునకలనెన్నింటినో వెదజల్లాను. నా కోరికల పిల్లలు ఈ కొండలలో నగ్నంగా తిరుగుతుంటారు. ఏ బరువూ లేకుండా, ఏ బాధా లేకుండా వీళ్ల నుండి నేను ఎలా వెళ్లిపోగలను?

ఈ రోజు నేను వదిలేసేది ఒక బట్ట కాదు, నా చేతులతో చీరివేసిన చర్మాన్ని.

నేను ఇక్కడ విడిచి వెళ్ళేది ఒక ఆలోచనని కాదు, ఆకలితో, దప్పికతో తీపెక్కిన హృదయాన్ని.

అయినప్పటికీ మరింతకాలం నేనిక్కడ తచ్చాడలేను.

అన్నిటినీ తన వైపునకు పిలిచే సముద్రం నన్నూ పిలుస్తోంది, నేను వెళ్లాలి.

రాత్రిళ్లు గంటలు గడిచిపోతున్నప్పటికీ ఉండి పోవడమంటే గడ్డ కట్టడమే, స్ఫటికంగా మారటమే, మూసలో బంధింపబడటమే.

ఇక్కడ ఉన్నవన్నీ నా వెంట తీసుకెళ్లాలని ఉంది. కాని ఎలా తీసుకెళ్లగలను?

తమకు రెక్కలనిచ్చిన నాలుకను, పెదాలను మాటలు తమ

వెంట తీసుకెళ్లలేవు. మాటలు ఒంటరిగానే గాలిలో కలిసిపోవాలి.

గద్ద కూడా తన గూడు లేకుండా ఒంటరిగా సూర్యుడికి ఎదురుగా ఎగరాలి.

కొండకిందికి చేరుకున్న తరవాత అతడు మళ్లీ సముద్రం వైపుకి తిరిగాడు. రేవుని ఓడ సమీపించటం చూశాడు. తన దేశం నుంచి వచ్చిన నావికులు అందులో ఉన్నారు.

అతడి ఆత్మ వాళ్లకోసం అర్రులు చాచింది. అతడిలా అన్నాడు:

అలనాటి నా తల్లి పిల్లలారా, అలల రౌతుల్లారా!

ఎన్నిసార్లో మీరు నా కలల్లో పయనించారు. ఇప్పుడు మరింత లోతైన కలగాఉన్న నా మెలకువలో మీరు వస్తున్నారు.

నేను బయలుదేరటానికి సిద్ధంగా ఉన్నాను. గాలి కోసం ఎదురు చూస్తున్న ఎత్తిన తెరచాప మాదిరి నా ఆతురత ఉంది.

చలనం లేని ఈ గాలిలో మరొక్కసారే ఊపిరి తీసుకుంటాను. ప్రేమ నిండిన చూపులతో మరొక్కసారి వెనక్కి చూస్తాను. ఆ తరవాత సముద్ర యాత్రికులలో ఒకడిగా మీతోపాటు నిలబడతాను.

నిదురిస్తున్న తల్లిలాఉన్న ఓ విశాల సముద్రమా!
నదికీ, వాగుకీ నువ్వు మాత్రమే శాంతివీ, స్వేచ్ఛవీ!
ఈ వాగు నిన్ను కలిసేలోగా మరొక్క మలుపు మాత్రమే తీసుకుంటుంది, మరొక్కసారి మాత్రమే గలగలలాడుతుంది.
అంతులేని సముద్రాన్ని అంతులేని బిందువు కలిసినట్లు నిన్ను కలుస్తాను.

పొలాలు, ద్రాక్ష తోటలనుండి పురుషులు, స్త్రీలు నగర ద్వారాల వైపుకి వేగంగా వస్తుండటం అతడు దూరం నుండి చూశాడు. తనని పేరు పెట్టి పిలవటం, తన ఓడ వచ్చిన సంగతి ఒకరితో ఒకరు పొలాలమీదగా అరుస్తూ చెప్పుకోవటం విన్నాడు.

తనలో తాను అతడనుకున్నాడు:
విడిపోయే రోజే సమావేశమయ్యే రోజవుతుందా?
నా సాయంత్రం నిజానికి తొలిపొద్దు అవుతుందా?
చాలు మధ్యలో నాగలిని ఆపి వచ్చిన వ్యక్తికీ, ద్రాక్షరసం తీస్తూ మధ్యలో ఆపి వచ్చిన వ్యక్తికీ నేనేమి ఇవ్వగలను?
నా హృదయం పండ్లతో నిండిన చెట్టుగా మారితే ఆ పండ్లను వారికి ఇద్దును!
నా కోరికలు జలపాతాలై ప్రవహిస్తే వారి పాత్రలను నింపుదును!

శక్తిమంతుడి చేతిలో పలికే తుంబురనవుదునా, అతడు ఊపిరులు ఊదే వేణువునవుదునా!

నేను నిశ్శబ్దాలను వెతికే వాడిని. ఆత్మవిశ్వాసంతో పంచి పెట్టగల ఏ నిధులను ఈ నిశ్శబ్దాలలో కనుగొన్నాను?

ఇది నేను కోతకోసే రోజయితే ఏ పొలాల్లో, గుర్తులేని ఏ కాలాల్లో విత్తనం విత్తాను?

నా లాంతరు ఎత్తిపెట్టే గడియ నిజంగా ఇదే అయితే అందులో వెలిగే కాంతి నాది కాదు.

ఖాళీగా, చీకటిగా ఉన్న నా లాంతరును ఎత్తి పట్టుకుంటాను. రాత్రి రక్షకుడు దానిని నూనెతో నింపుతాడు, అతడే దానిని వెలిగిస్తాడు.

ఈ విషయాలను అతడు మాటల్లో అనుకున్నాడు. మాటల్లో అనుకోనిది మరెంతో అతడి హృదయంలో ఉండిపోయింది. అతని లోతైన రహస్యాలను అతడు కూడా పలకలేడు.

నగరంలోకి ప్రవేశించిన తరవాత అందరూ అతడిని కలవటానికి వచ్చారు. అందరూ ఒకే కంఠంగా అతడిని పిలుస్తున్నారు.

నగరం పెద్దలు ఇలా అన్నారు:

అప్పుడే మమ్మల్ని విడిచి వెళ్లవద్దు.

మా సందె చీకట్లలో నువ్వు మధ్యాహ్నపు సూర్యుడివలె వెలిగావు. నీ యవ్వనం మా కనులకు కలలను ఇచ్చింది.

నువ్వు మాకు అపరిచితుడివి కాదు, అతిథివీ కాదు. నువ్వు మా కొడుకువి, మా ప్రియతముడివి.

నీ మోముకై మా కళ్లు ఆశతో వెతుకులాడేలా చేయవద్దు.

పూజారులు, పూజారిణులు అతడితో ఇలా అన్నారు:

సముద్రపు అలలు మనల్ని విడదీయనివ్వవద్దు. మా మధ్య నువ్వు గడిపిన సంవత్సరాలను జ్ఞాపకాలుగా మార్చవద్దు.

మా మధ్య ఒక ఆత్మలా తిరిగావు, నీ నీడ మా ముఖాలపై వెలుగును నింపింది.

నిన్ను మేం ఎంతగానో ప్రేమించాం. కాని మాటలు లేకుండా, ఎన్నో ముసుగుల మాటున ఆ ప్రేమ ఉండిపోయింది.

ఇప్పుడు అది నిన్ను ఎలుగెత్తి పిలుస్తోంది, బయటపడి నీ ముందు నిలబడుతోంది.

ఎడబాటు గడియ వచ్చేదాకా ప్రేమకి తన లోతు తెలియక పోవటం ఎప్పుడూ జరుగుతున్నదే.

ఇతరులు కూడా వచ్చి అతడిని బతిమలాడారు. అయినా అతడు బదులు ఇవ్వలేదు. తన తలను మాత్రం వంచుకున్నాడు; దగ్గరగా నుంచున్నవాళ్ళు అతడి ఎదపై పడుతున్న కన్నీటి బిందువులను చూశారు.

అతడు, నగరప్రజలు కలిసి గుడిముందు ఉన్న పెద్ద మైదానంవైపు నడవసాగారు.

ఆ మందిరం నుంచి అల్‌మిత్రా అనే పేరుగల ఒక మహిళ బయటకు వచ్చింది. ఆమె సాధురాలు.

ఆమెవంక అతడు ఎంతో మృదువుగా చూశాడు. ఆ నగరంలోకి అతడు వచ్చిన మరు రోజుకే ఆమె అతడిని నమ్మింది. అతడి మాటలు విన్నది.

ఆమె అతడితో ఇలా అంది:

దైవ ప్రవక్తా! అనంతమైనది కోరుకునేవాడా! నీ ఓడ కోసం దూరాలను ఎంతో కాలంగా వెతుకుతున్నావు.

ఈనాడు నీ ఓడ వచ్చింది, నువ్వు వెళ్లక తప్పదు.

నీ మహోన్నత కోరికలకు నిలయమైన జ్ఞాపకాల నేలని నువ్వు ఎంతగానో కలవరిస్తున్నావు. మా ప్రేమ నిన్ను కట్టివేయదు, మా అవసరాలు నిన్ను ఆపవు.

అయితే మమ్మల్ని విడిచి వెళ్లేముందు నీ సత్యాన్ని మాకు ఇవ్వమని అడుగుతున్నాం.

ఆ సత్యాన్ని మేం తిరిగి మా పిల్లలకి ఇస్తాం, వాళ్లు వాళ్ల పిల్లలకి ఇస్తారు, అది ఎన్నటికీ అంతం కాదు.

ఒంటరితనంలో నువ్వు మా రోజులను గమనించావు. మా నిద్దురలోని నవ్వునీ, ఏడ్పునీ మెలకువలో విన్నావు.

కాబట్టి మా గురించి మాకు తెలియచెప్పు. పుట్టుకకీ, చావుకీ మధ్య నీకు గోచరమయ్యింది మాకు చెప్పు.

అతడు ఇలా బదులు పలికాడు:

ఆర్ఫలీస్ ప్రజలారా! ఇప్పుడు కూడా మీ ఆత్మలలో మెసులుతున్న దానికి మించి నేను ఇంకేమి చెప్పగలను?

అప్పుడు అల్‌మిత్రా అడిగింది, మాకు ప్రేమ గురించి చెప్పు.

అతడు తల ఎత్తి చుట్టూ ఉన్న ప్రజలను చూశాడు. అప్పుడు వాళ్లందరూ కదలక ఉండిపోయారు. అతడు ఎలుగెత్తి ఇలా చెప్పాడు:

ప్రేమ దారులు కష్టమైనవీ, ఎత్తైనవీ అయినప్పటికీ మిమ్మల్ని రమ్మన్నప్పుడు దానిని అనుసరించండి.

దాని ఈకల మధ్య ఉన్న కత్తులు గాయపరిచినప్పటికీ అది మిమ్మల్ని పొదువుకున్నప్పుడు అర్పితం అవ్వండి.

ఉత్తరపుగాలి తోటను నాశనం చేసినట్లు దాని గొంతుక మీ కలలను చెల్లా చెదురు చేసినప్పటికీ అది మాటలాడినపుడు నమ్మండి.

ప్రేమ మీకు కిరీటం తొడిగినపుడే మిమ్మల్ని శిలువ వేస్తుంది.

అది మీ ఎదుగుదలకు సాయపడినట్లే మీ కొమ్మలను కూడా కత్తిరిస్తుంది.

మీ ఎత్తులకు పాకి, ఎండలో ఊగిసలాడే లేత కొమ్మలను అది నిమిరినట్లుగానే

మీ లోపలికల్లా పాకి, మట్టిని పట్టుకున్న వేళ్లను కుదిపివేస్తుంది.

పంటకొచ్చిన కంకుల్లా మిమ్మల్ని సేకరిస్తుంది.

నగ్నంగా నిలబడేలా మిమ్మల్ని నూరుస్తుంది.

పొల్లు నుంచి వేరు చేసేలా మిమ్మల్ని తూర్పారబడుతుంది.

తెల్లగా అయ్యేలా మిమ్మల్ని తిరగలి పడుతుంది.

మృదువుగా అయ్యేలా మిమ్మల్ని కలుపుతుంది.

అప్పుడు దేవుని పవిత్ర విందులో పవిత్రమైన రొట్టెవి అయ్యేందుకు, పవిత్రమైన నిప్పుమీద అది మిమ్మల్ని కాలుస్తుంది.

మీ హృదయపు రహస్యాలు తెలుసుకుని, ఆ తెలివిడిలో,

జీవన హృదయంలో ఒక అంశ కావాలని ప్రేమ మీకివన్నీ చేస్తుంది.

కానీ మీ భయంలో కేవలం ప్రేమ శాంతినీ, ప్రేమలో ఆనందాన్ని మాత్రమే కోరుకుంటే
మీ నగ్నత్వాన్ని కప్పుకుని ప్రేమ నూర్పిడికళ్లంనుంచి
మీ నవ్వులన్నింటినీ నవ్వుకోలేని, మీ కన్నీరంతటిని కార్చలేని కాలాలు లేని జగతిలోకి వెళ్లిపోండి.

ప్రేమ తనని తాను తప్ప ఇచ్చుకోలేదు, తననుంచి తప్ప తీసుకోలేదు.
ప్రేమ ఇంకొకరిని లోబరచుకోదు, ఇంకొకరికి లోబడదు, ప్రేమకు ప్రేమ మాత్రమే చాలు.

ప్రేమించినపుడు "దేవుడు నా హృదయంలో ఉన్నాడు," అనకూడదు. "దేవుని హృదయంలో నేనున్నాను," అనాలి.
ప్రేమ మార్గాన్ని మీరు మళ్లించగలరని అనుకోవద్దు, అర్హులుగా కనపడితే ప్రేమే మీ బాటను నిర్దేశిస్తుంది.

తనను తాను పరిపూర్ణం చేసుకోటానికి మించి ప్రేమకు మరో కోరిక లేదు.

ప్రేమించి, మీకు కోరికలు ఉండటం తప్పనిసరి అయితే

రాత్రిళ్లకు గలగలల సంగీతం వినిపించే వాగులా కరిగి పోవాలనీ, ప్రవహించాలనీ కోరుకోండి;

మితిమీరిన మృదుత్వపు బాధ తెలుసుకోవాలనీ,

ప్రేమ గురించి మీ అవగాహనలో గాయపడాలనీ,

ఆనందంగా, ఇష్టపూర్వకంగా రక్తం కారనివ్వాలనీ కోరుకోండి;

తొలిపొద్దున రెక్కలు తొడిగిన హృదయం మేలుకుని, ప్రేమ నిండిన మరొక రోజుకి కృతజ్ఞతలు చెప్పాలని కోరుకోండి;

మధ్యాహ్నపు వేళలో విశ్రమించి ప్రేమ మాధుర్యాన్ని ధ్యానించాలనీ,

సాయం పొద్దులో కృతజ్ఞతా పూర్వకంగా ఇంటికి చేరుకోవాలనీ కోరుకోండి;

ప్రియతమ కోసం పెదవులపై ప్రశంసల పాటతో, హృదయంలో ప్రార్థనతో నిద్రపోవాలనీ కోరుకోండి.

మళ్లీ అల్‌మిత్రానే అడిగింది. అయ్యా, వివాహం గురించి చెప్పు.

అతడు ఇలా బదులిచ్చాడు:

మీరు ఇరువురూ కలిసి పుట్టారు, ఇక ఎల్లకాలమూ మీరు కలిసే ఉంటారు.

మృత్యువు తెల్లటి రెక్కలు మీ రోజులను చెల్లా చెదురు చేసినపుడు కూడా మీరు కలిసే ఉంటారు.

దేవుని నిశ్శబ్దపు జ్ఞాపకాలలో సైతం మీరు కలిసే ఉంటారు.

కానీ మీ కలయికలో కొంత ఎడం ఉండనివ్వండి.

స్వర్గలోకపు గాలులు మీ మధ్య నాట్యమాడనివ్వండి.

ఒకరినొకరు ప్రేమించుకోండి, కాని ప్రేమను బంధంగా చేయవద్దు:

మీ ఆత్మల తీరాల మధ్య కదిలే సముద్రంలా ప్రేమ ఉండాలి.

ఒకరి పాత్రను మరొకరు నింపండి, కాని ఒకే పాత్రనుంచి

ఇరువురూ తాగవద్దు.

ఒకరికొకరు రొట్టె ఇవ్వండి. కాని ఒకే రొట్టెను ఇరువురూ తినవద్దు.

ఇద్దరూ కలిసి పాడండి, ఆడండి; సంతోషంగా ఉండండి, కాని ఎవరికి వారు ఒంటరిగానే ఉండండి:

వేణువులోని రంధ్రాలు ఒకే నాదంతో వణికినప్పటికీ అవి వేటికవే ఉంటాయి.

మీ హృదయాలను ఇచ్చి పుచ్చుకోండి, కాని ఒకరి ఏలుబడిలోకి వెళ్లవద్దు:

జీవితాన్ని ఇచ్చే చెయ్యి ఒక్కటే మీ హృదయాలను ఇముడ్చుకో గలదు.

పక్క పక్కన నిలబడండి, కాని మరీ అతుక్కుపోకండి:

గుడి స్థంభాలు దూరంగానే ఉంటాయి;

మర్రి చెట్టు, రావి చెట్టు ఒక దాని నీడలో మరొకటి పెరగవు.

హృదయానికి ఒక బిడ్డను హత్తుకుని ఉన్న స్త్రీ పిల్లల గురించి మాట్లాడండి అని అడిగింది.

అతడిలా అన్నాడు:

మీ పిల్లలు మీ పిల్లలు కారు.

తనను తాను కోరుకునే జీవితపు కొడుకులూ, కూతుళ్లూ వారు.

వారు మీ ద్వారానే వస్తారు, కానీ మీ నుంచి కాదు.

మీతో ఉన్నప్పటికీ వాళ్లు మీకు చెందరు.

వారికి ప్రేమను ఇవ్వవచ్చు, కానీ మీ ఆలోచనలను ఇవ్వవద్దు:

వాళ్ల ఆలోచనలు వాళ్లకి ఉంటాయి.

వాళ్ల శరీరాలకు ఆశ్రయం ఇవ్వవచ్చు, కానీ వాళ్ల ఆత్మలకు కాదు:

మీ కలల్లో సైతం చూడలేని రేపటి ఇళ్లల్లో వాళ్ల ఆత్మలు ఉంటాయి.

వారిలాగే మీరు ఉండటానికి ప్రయత్నించవచ్చు, కానీ మీలాగా వారిని చెయ్యటానికి పూనుకోవద్దు:

జీవితం వెనక్కి నడవదు, నిన్నటితో కాలయాపన చెయ్యదు.

మీ పిల్లలు సజీవులైన బాణాల మాదిరి విడవబడేందుకు ఉపయోగపడే విల్లు మీరు.

అనంతపథంలోకి గురి చూసి బాణాలు వేగంగా, దూరానికి చేరుకునేలా తన శక్తినంతటితో విలుకాడు విల్లుని వంచినట్లు మిమ్మల్ని వంచుతాడు.

విలుకాడి చేతిలో మీరు వంచబడటం సంతోషంకోసమే కానివ్వండి:

దూసుకుపోతున్న బాణాన్ని ప్రేమించినట్లే తన చేతిలో స్థిరంగా ఉన్న విల్లునీ అతడు ప్రేమిస్తాడు.

అప్పుడు ఒక ధనికుడు ఇవ్వటం గురించి మాట్లాడండి అన్నాడు.

అతడు ఇలా బదులిచ్చాడు:

మీరు ఆస్తులను ఇచ్చినపుడు చాలా కొంచెమే ఇచ్చినట్లు. మిమ్మల్ని మీరు అర్పించుకున్నప్పుడే నిజంగా ఇచ్చినట్లు. రేపటికి అవసరం అవుతాయేమోనన్న భయంతో దాచుకున్న వస్తువులే మీ ఆస్తులు అవుతాయి.

పవిత్ర నగరానికి వెళుతున్న భక్తులను అనుసరించే కుక్క - దారులు లేని ఇసుకలో రేపటి కోసం అతి జాగ్రత్తగా ఎముక ముక్కను దాచుకుంటే, రేపు దానికి దక్కేదేమిటి? అవసరమనే భయమే అవసరమవుతుంది.

బావి నిండుగా ఉన్నపుడు కూడా దప్పికకొంటామేమోనన్న భయం తీరని దాహం కాదా?

తమకి ఉన్న అపార సంపదలోంచి కొంచెమే ఇచ్చేవాళ్లు కొందరు - అది కూడా వాళ్లు గుర్తింపు కోసం ఇస్తారు. దాగి

ఉన్న వారి కోరిక కారణంగా వారిచ్చే బహుమతులు అసంపూర్ణమవుతాయి.

కొంచెమే ఉన్నప్పటికీ ఉన్నదంతా ఇచ్చేవాళ్లు మరి కొందరు. వీళ్లు జీవితంలోనూ, జీవిత అనంత సంపదలోనూ నమ్మకమున్నవాళ్లు. వాళ్ల గల్లాపెట్టె ఎప్పటికీ నిండుకోదు.

సంతోషంతో ఇచ్చేవాళ్లు కొందరు, ఆ సంతోషమే వారి ప్రతిఫలం.

బాధపడుతూ ఇచ్చేవాళ్లు కొందరు, వాళ్ల బాధే వారికి పునర్జన్మ.

మరి కొందరు ఇస్తారు. కానీ, వాళ్లకి ఇవ్వటంలో బాధ తెలియదు, సంతోషం కోరుకోరు, మంచిపని చేస్తున్నామన్న తలంపు కూడా ఉండదు:

లోయలోని పూ పొదలు గాలిలోకి పరిమళాలని విరజిమ్ము తున్నట్లు వాళ్లు ఇస్తారు.

ఇటువంటి వాళ్ల చేతల ద్వారా దేవుడు మాట్లాడతాడు, వాళ్ల కళ్లచాటునుండి అతడు పుడమిపై నవ్వులు కురిపిస్తాడు.

అడిగినప్పుడు ఇవ్వటం మంచిది, కాని అడగకుండానే అర్థంచేసుకుని ఇవ్వటం మరీ మంచిది.

ఇవ్వటంలో కంటే దానిని అందుకునే వారిని వెతకటంలో ఆనందం ఉంటుంది.

మీరు దాచుకోవలసింది ఏమైనా ఉందా?

మీ దగ్గర ఉన్నదంతా ఇచ్చివెయ్యవలసిన రోజు ఒకటి వస్తుంది.

కాబట్టి ఇచ్చే రోజులు మీ వారసులవి కాకుండా మీవి కావాలంటే ఇప్పుడే ఇవ్వండి.

"అర్హులైన వారికి మాత్రమే ఇస్తాను," అని మీరు తరచు అంటుంటారు.

మీ తోటలోని చెట్లు అలా అనవు, మీ మైదానంలోని పశువులూ అలా అనవు.

జీవించి ఉండటానికి అవి ఇస్తాయి: ఇవ్వకుండా ఉంచుకోవటం అంటే అంతరించి పోవటమే.

తన పగళ్ళు, రాత్రుళ్లు పొందటానికి అర్హుడయిన వాడు మీనుంచి అన్నీ అందుకోటానికి అర్హుడనటంలో సందేహం లేదు.

జీవితపు సముద్రంలోంచి తాగటానికి అర్హత పొందినవాడు నీ చిన్నవాగులోంచి తన పాత్ర నింపుకోటానికి అర్హుడే.

అందుకోవటంలోని ధైర్యం, ఆత్మ విశ్వాసం, ఇంకా చెప్పాలంటే దాతృత్వానికి మించిన ఎడారి మరెక్కడ ఉంది?

తీసుకునే వారు సిగ్గుపడేలా, వారి గౌరవం మంటకలిసేలా రొమ్ము విరుచుకుని, గర్వాన్ని చాటుకునే అధికారం మీకెక్కడిది?

ఇవ్వటానికీ, ఇవ్వటానికి సాధనంగా మారటానికీ మీకు అర్హత ఉందో లేదో ముందు చూసుకోండి.

నిజానికి జీవితం జీవితానికి ఇస్తుంది - ఇచ్చే వాళ్లుగా భావించే మీరు కేవలం దీనికి సాక్షులు మాత్రమే.

పుచ్చుకునే ప్రజలారా - మీరందరూ పుచ్చుకునేవాళ్లే - కృతజ్ఞతతో కుంగిపోకండి. ఇది మీ మీద, ఇచ్చినవారి మీద కాడి మోపినట్లు అవుతుంది.

ఇచ్చినవారితో కలిసి వారి బహుమతుల మీద రెక్కలతో ఎగరండి.

మీ రుణం గురించి అతిగా చింతించటం అంటే దేవుడు తండ్రిగానూ, అంతులేని హృదయమున్న భూమి తల్లిగానూ ఉన్న అతడి ఉదారత్వాన్ని అనుమానించినట్లు అవుతుంది.

అప్పుడు పూటకూళ్ల ఇళ్లు నడిపే ఒక ముసలి వ్యక్తి తినటం గురించి, తాగటం గురించి మాట్లాడమని అడిగాడు.

అతడు ఇలా అన్నాడు:

భూమి వాసనల మీద, వెలుతురు మీద ఆధారపడి బతికే మొక్క మాదిరి మీరు బతకగలిగితే బాగుండును.

కానీ, ఆహారం కోసం చంపాలి. దాహాన్ని తీర్చుకోటానికి పుట్టిన దూడ నుంచి దాని తల్లిపాలను దొంగిలించాలి. అయితే ఈ పనులు పూజచేస్తున్నట్లు ఉండాలి.

అడవిలోనూ, మైదానంలోనూ స్వచ్ఛమైనవీ, అమాయకమైనవీ మనిషిలోని మరింత స్వచ్ఛమైన, అమాయకమైన దానికోసం త్యాగంచేసే వేదికగా మీ భోజనపు బల్లను నిలబెట్టండి.

మీరు ఒక పశువును చంపేటప్పుడు మీ హృదయంలో దానికి ఇలా చెప్పండి:

“నిన్ను చంపిన శక్తి చేతిలో నేనూ చంపబడతాను, ఇంకొకరికి ఆహారం అవుతాను.

"నిన్ను నా పరం చేసిన చట్టమే నన్ను మరింత బలమైన చేతుల బారిన పడేటట్లు చేస్తుంది.
"నీ రక్తం, నా రక్తం స్వర్గలోక చెట్టుని పోషించే రసం తప్ప వేరే కాదు."

పళ్లతో ఒక పండును కొరికినప్పుడు మీ హృదయంలో దానికి ఇలా చెప్పండి:
"నీ విత్తులు నా శరీరంలో జీవించి ఉంటాయి.
"రేపటి నీ మొగ్గలు నా హృదయంలో వికసిస్తాయి,
"నీ వాసన నా ఊపిరి అవుతుంది,
"మనిద్దరం కలిసి అన్ని కాలాలలోనూ సంబరాలు జరుపుకుందాం."
ఆకురాలే కాలంలో సారాయి తయారు చెయ్యటానికి ద్రాక్షపండ్లు సేకరించేటప్పుడు మీ హృదయంలో ఇలా చెప్పండి:
"నేనూ ఒక ద్రాక్ష తీగనే, మద్యం కోసం నా పండ్లు సేకరింపబడతాయి.
"కొత్త మద్యం మాదిరి నేను కూడా కాలం ఎరగని పాత్రల్లో నింపబడతాను."
శీతాకాలంలో మద్యం తీసుకునేటప్పుడు ప్రతి పాత్రకూ మీ హృదయంలో ఒక పాటని నింపండి;
ఆ పాటలో ఆకురాలే రోజులనూ, ద్రాక్ష తీగలనూ, రసం తీసిన యంత్రాలనూ గుర్తుకు తెచ్చుకోండి.

అప్పుడు నాగలి పట్టిన రైతు పని గురించి మాతో మాట్లాడు అన్నాడు.

అతడు ఇలా బదులిచ్చాడు:

పుడమితోనూ, పుడమి ఆత్మతోనూ కలిసి ముందడుగు వెయ్యటానికి మీరు పనిచేస్తారు.

పని చెయ్యకుండా ఉండటమంటే కాలాలకు వింతవ్యక్తిగా మారటం; అనంతం వైపు గంభీరంగా, హుందాగా పయనించే జీవితపు ఊరేగింపులోంచి పక్కకి తొలగటం.

పనిచేస్తున్నప్పుడు నువ్వు వేణువుగా మారతావు, దాని గుండెలలో గంటలు గుసగుసలాడటం సంగీతంలా మారుతుంది.

సమస్తమూ ఏకమై పాడుతుండగా ఎవరు మాత్రం రెల్లుపొద మాదిరి మూగిగా, నిశ్శబ్దంగా ఉండిపోతారు?

పని ఒక శాపమనీ, శ్రమ దురదృష్టమనీ మీకు చెబుతుంటారు.
పుడమి అనంతకాలంలో ఒక భాగాన్ని పూర్తి చెయ్యటానికి ఆ కల పుట్టినపుడు మీకు నిర్దేశించిన పాత్రను పనిచేయటం ద్వారా పోషిస్తున్నారని నేనంటాను.
శ్రమించటం నిజానికి జీవితాన్ని ప్రేమించటం అవుతుంది.
జీవితాన్ని శ్రమ ద్వారా ప్రేమించటం జీవితపు లోతైన రహస్యాలతో సాన్నిహిత్యం పెంచుకోవటం అవుతుంది.

మీ బాధలో జననం నరకమనీ, ఈ శరీరాన్ని పోషించటం నుదిటిపై రాసిన శాపమనీ మీరు అనుకుంటుంటారు. శ్రమ ద్వారా పట్టిన చెమట మాత్రమే ఆ నుదిటి రాతను చెరిపేయగలదని నేను బదులిస్తాను.

జీవితం అంటే చీకటని మీకు చెప్పారు. అలసట చెందిన వాళ్లు చెప్పింది మీ అలసటలో తిరిగి చెబుతున్నారు.
కోరిక అనేది లేనప్పుడు జీవితం చీకటవుతుందని నేను చెబుతున్నాను.
జ్ఞానం అనేది లేనప్పుడు కోరికలన్నీ గుడ్డివి అవుతాయి.
పనిలేనప్పుడు జ్ఞానమంతా వృథా అవుతుంది,
ప్రేమలేనప్పుడు పని అంతా డొల్ల అవుతుంది;

ప్రేమతో పనిచేసినప్పుడు మీతో మీరు, ఒండరులతో, దేవుడితో బంధాలు ఏర్పరచుకుంటారు.

ప్రేమతో పనిచేయడం అంటే ఏమిటి?

ప్రియతమ ధరిస్తుందన్నట్లుగా గుండె నుంచి తీసిన దారపు పోగులతో బట్ట నేయడం వంటిది.

ప్రియతమ నివసిస్తుందన్నట్లుగా ఎంతో మమకారంతో ఇంటిని కట్టడం వంటిది.

ప్రియతమ తింటుందన్నట్లుగా ఎంతో సున్నితంగా విత్తనాలు విత్తటం, ఎంతో సంతోషంగా పంటను కోయటం వంటిది.

చేసే ప్రతిపనిలో ఆత్మను ఊది మీదైన ముద్రను వేయటం వంటిది,

చనిపోయిన వారందరు చుట్టూ చేరి మిమ్మల్ని గమనిస్తున్నారని తెలుసుకోవటం వంటిది.

"పాలరాతిలో తన ఆత్మను ప్రతిబింబించే శిల్పి మట్టిని దున్నేవాడి కంటే ఉన్నతుడనీ,

"ఇంద్ర ధనుస్సును తెచ్చి దానిని బట్టగా నేసేవాడు చెప్పులు చేసేవాడి కంటే ఉన్నతు''డనీ మీరు నిదురలో మాదిరి అనటం నేను చాలాసార్లు విన్నాను.

కాని నేను నిదురలో కాదు, మిట్టమధ్యాహ్నం మెలకువలో చెబుతున్నాను:

రావిచెట్టుతో మాట్లాడినంత మధురంగానే గడ్డిపరకతో కూడా గాలి మాట్లాడుతుంది;
తన ప్రేమతో గాలి గొంతుకను మధురమైన పాటగా మలిచేవాడొక్కడే గొప్పవాడు.

పని ప్రేమను కనపడేలా చేస్తుంది.
ప్రేమతో కాకుండా అయిష్టంగా తప్ప పని చెయ్యలేకపోతే మీ పనిని వదిలిపెట్టి సంతోషంతో పనిచేసేవాళ్లనుంచి మందిరం దగ్గర కూర్చుని బిచ్చం అడుక్కోవటం మంచిది.
మీరు అయిష్టంగా రొట్టెను కాలిస్తే ఒక చేదురొట్టె తయారవుతుంది. అది మనిషి సగం ఆకలిని మాత్రమే తీరుస్తుంది.
ద్రాక్ష కాయలను తిట్టుకుంటూ వత్తితే ఆ రసంలోకి మీ తిట్లు విషాన్ని దించుతాయి.
మీరు ఎంత మధురంగా పాడినా, ఇష్టంగా పాడకపోతే పగటి శబ్దాలకు, రాత్రి శబ్దాలకు మనిషిని చెవిటివాడిని చేస్తారు.

అప్పుడు ఒక మహిళ సంతోషం గురించి, దుఃఖం గురించి మాతో మాట్లాడు అంది.

అతడు బదులిచ్చాడు:

మీ దుఃఖం ముసుగు తొలగిస్తే సంతోషం అవుతుంది.

నవ్వులు ఊరే బావి ఒకప్పుడు మీ కన్నీటితో నింపబడింది. అంతకంటే వేరేగా ఎలా ఉంటుంది?

దుఃఖం లోలోపల ఎంతగా తొలచివేస్తే మీరు అంత ఆనందాన్ని పట్టుకోగలుగుతారు.

మద్యాన్ని పట్టిఉంచే పాత్ర కుమ్మరి ఆములో కాల్చబడలేదా?

మీ ఆత్మను శాంతపరిచే వేణువు కత్తులతో తొలచబడలేదా?

సంతోషంగా ఉన్నప్పుడు మీ హృదయ లోతులలోకి చూసుకోండి: మీకు దుఃఖాన్ని కలిగించినదే సంతోషాన్ని కూడా కలిగిస్తోందని అర్థమవుతుంది.

విచారంగా ఉన్నప్పుడు మీ హృదయంలోకి చూసుకోండి. మీరు దేనికైతే సంబరపడిపోతారో దాని కారణంగానే ఏడుస్తున్నారని అర్థమవుతుంది.

మీలో కొంతమంది "దుఃఖం కంటే సంతోషం గొప్పది," అంటారు. మరికొందరు "కాదు, దుఃఖమే గొప్పది," అంటారు.

అవి రెండూ విడదీయరానివని నేనంటాను. అవి రెండూ కలిసేవస్తాయి. ఒకటి మీతోపాటు బల్లదగ్గర కూర్చుని ఉంటే రెండవది మీ మంచం మీద వేచి ఉంటుందని మరువవద్దు.

తక్కెడలో మాదిరి సంతోషం, దుఃఖం మధ్య మీరు వేలాడుతుంటారు.

తక్కెడలో ఏమిలేనప్పుడు మాత్రమే అది స్థిరంగా, నిలకడగా ఉంటుంది.

కాని నిధుల దొర తన బంగారాన్ని, వెండిని కొలవటానికి మిమ్మల్ని తక్కెడ మాదిరి ఎత్తినపుడు మీ సంతోషమో, దుఃఖమో పైకి లేవాలి, లేదా కిందకి పడాలి.

అప్పుడు ఒక మేస్త్రీ ముందుకొచ్చి ఇళ్ల గురించి మాట్లాడు అన్నాడు.

అతడు బదులుగా ఇలా పలికాడు:

మీ ఊహలతో అడవులలో పొదరిళ్లు కట్టుకుంటే ఎంత బాగుండును. కాని మీరు గోడలు ఉన్న నగరాల లోపల ఇళ్లు కట్టుకుంటారు.

సాయం సంధ్యలో మీరు ఇళ్లకు తిరిగివచ్చినట్లే మీలోని సంచారకుడు కూడా ఇంటికి చేరుకుంటాడు - అతడు ఎప్పుడూ దూరంగా, ఒంటరిగా ఉండిపోతాడు.

మీ ఇల్లు ఒక బృహత్ శరీరం వంటిది.

అది ఎండలో పెరిగి, రాత్రి నిశ్చలతలో నిదురపోతూ ఉంటుంది. దానికీ కలలు లేకపోలేదు. మీ ఇల్లు కలలు కనదా? ఆ కలల్లో నగరాన్ని విడిచి లోయలు, కొండ శిఖరాలలో విహరించదా?

మీ ఇళ్లను నా చేతుల్లోకి తీసుకుని విత్తులువిత్తే వాని మాదిరి వాటిని అడవుల్లోనూ, మైదానాల్లోనూ వెదజల్లాలని ఎంతో కోరికగా ఉంది.

లోయలు మీ వీధులుగా, పచ్చనిదారులు సందులుగా ఉండి ఒకరినొకరు కలుసుకునేటప్పుడు ద్రాక్షతోటలలో నడుస్తూ మీ బట్టలు పుడమి వాసనలతో ఉంటే ఎంత బాగుండును.

అయితే ఈ విషయాలు ఇప్పుడే సాధ్యం కావు.

తమ భయంలో మీ ముత్తాతలు మీ ఇళ్లను మరీ దగ్గరగా కట్టారు. ఈ భయం మరి కొన్నాళ్లు ఉంటుంది. ఇంకొన్నాళ్లు మీ ఇళ్లనూ, పొలాలనూ పట్టణ గోడలు వేరుచెయ్యక తప్పదు.

ఓ ఆర్ఫలీస్ ప్రజలారా! ఈ ఇళ్లల్లో ఏముంచారో చెప్పండి. తలుపులు బిగించుకుని మీరు కాపాడుకుంటున్నది ఏమిటి?

మీలోని శక్తిని వెల్లడిచేసే తపన, శాంతి మీ ఇళ్లల్లో ఉన్నాయా?

మనసు శిఖరాలను కలిపే కాంతుల తోరణాల వంటి జ్ఞాపకాలు మీ ఇళ్లల్లో ఉన్నాయా?

కలపతో, రాయితో మలిచిన వస్తువులునుంచి మీ హృదయాన్ని పవిత్రమయిన కొండకు మళ్లించే అందం మీ ఇళ్లల్లో ఉందా?

మీ ఇళ్లల్లో ఇవన్నీ ఉన్నాయా చెప్పండి.

అతిథిలా ప్రవేశించి అధిపతిగా మారే సౌఖ్యం, సౌఖ్య కాంక్ష మాత్రమే మీ ఇళ్లల్లో ఉన్నాయా?

ఔను, సౌఖ్యం మిమ్మల్ని మచ్చిక చేస్తుంది, విస్తృత కోరికలకు బానిసలుగా చేస్తుంది.

దాని చేతులు పట్టుమాదిరి మెత్తగా ఉన్నప్పటికీ హృదయం మాత్రం ఇనుముతో చేయబడింది.

అది జోలపాడి నిద్రపుచ్చి మీ మంచం పక్కన నిలబడి శరీర కాంక్షలను పరిహసిస్తుంది.

మీ ఇంద్రియాలను పక్కదారి పట్టించి పగిలిన గాజుపాత్రల మాదిరి ముళ్లపొదల్లో పారవేస్తుంది.

సౌఖ్యం పట్ల కోరిక ఆత్మ ఆవేశాలను చంపేసి అంత్య-క్రియలలో నవ్వుతూ తిరుగుతుంది.

విశ్వం పిల్లలైన మీరు, విశ్రమించినపుడు కూడా కొట్టుమిట్టాడే మీరు బంధింపబడలేరు, మచ్చిక చేయబడలేరు.

మీ ఇల్లు లంగరు మాదిరికాక తెరచాప కొయ్యలాగా ఉండాలి.

అది గాయాన్ని కప్పి ఉంచే తళుకుపొర కాకుండా కంటిని కాపాడే కనురెప్ప కావాలి.

ఇళ్లలోనికి వెళ్లటానికి రెక్కలు ముడుచుకునే అవసరం రాకూడదు, పైకప్పు తగులుతుందేమోనని తలలు వంచి

నడవగూడదు, గోడలు బీటలువారి, పగిలిపోతాయని ఊపిరి తియ్యటానికి భయపడకూడదు.

బతికున్నవాళ్ల కోసం చనిపోయినవాళ్లు తయారుచేసిన సమాధులలో మీరు నివసించకూడదు.

ఎంతో అట్టహాసంగా, ఎంతో అద్భుతంగా మీ ఇల్లు ఉన్నప్పటికీ అది మీ రహస్యాలను పట్టి ఉంచలేదు, మీ కోరికలకు ఆశ్రయం ఇవ్వలేదు.

మీలో అంతులేనిది ఆకాశ హార్మ్యంలో నివసిస్తుంది: ఉదయపు మంచు దాని తలుపులు; రాత్రి పాటలు, నిశ్శబ్దాలు దాని కిటికీలు.

అప్పుడు నేత పనివాడు బట్టల గురించి మాట్లాడండి అని అడిగాడు.

అప్పుడతను ఇలా బదులిచ్చాడు:

మీలో అందాన్ని చాలా వరకు మీ బట్టలు కప్పుతాయి, కాని అందంగా లేనివాటిని బహిర్గతం చేస్తూనే ఉంటాయి.

మరుగు ఇచ్చే స్వేచ్ఛని బట్టలలో మీరు కోరుకున్నప్పటికీ మీరు అందులో బంధాలనీ, భారాలనీ చూస్తారు.

బట్టలతో కాకుండా ఎక్కువగా మీ శరీరంతో ఎండనీ, గాలినీ స్పృశించగలిగితే ఎంత బాగుండును:

ఎండలో జీవితపు ఊపిరి, గాలిలో దాని చెయ్యి ఉన్నాయి.

"మేము వేసుకునే బట్టలను ఉత్తరపు గాలి నేసింది," అని మీలో కొందరంటారు.

ఔను, ఉత్తరపు గాలే అని నేనూ అంటాను.

సిగ్గు దాని మగ్గం, మూల్గులు మెత్తబడటం దాని దారాలు.

తన పని పూర్తి అయిన తరువాత అది అడవిలో నవ్వింది. మలినమైన కంటి చూపునుంచి రక్షణకే మరుగు అవసరము అయ్యిందని మరిచిపోకండి.

మలినమైన వాళ్లు లేనప్పుడు మరుగు మెదడుకు బంధం గానూ, కలుషితం చేసేది గానూ అవుతుంది.

మీ అరికాళ్లను తాకి పుడమి పులకరించి పోతుందనీ, మీ జుట్టుతో ఆడి గాలి ఉర్రూతలూగుతుందనీ మరిచిపోవద్దు.

అప్పుడు ఒక వ్యాపారి అమ్మటం, కొనటం గురించి మాతో మాట్లాడు అన్నాడు.

అతను ఈ విధంగా బదులిచ్చాడు:

మీకు భూమి తన ఫలాలను అందిస్తోంది. మీ దోసిళ్లు ఎలా నింపుకోవాలో తెలిస్తే ఏ కొరతా ఉండదు.

పుడమి బహుమతులను ఇచ్చి పుచ్చుకోవడంలోనే మీరు సంతృప్తినీ, అనంత సంపదనీ కనుగొంటారు.

ఈ ఇచ్చిపుచ్చుకోవటం అన్నది ప్రేమతోనూ, దయతో కూడిన న్యాయంతోనూ ఉంటే తప్పించి అది కొంత మందిని అత్యాశకీ, కొంతమందిని ఆకలికీ గురిచేస్తుంది.

సముద్రంలో, పొలాల్లో, ద్రాక్షతోటల్లో కష్టపడే జీవుల్లారా! సంతలో నేతగాళ్లు, కుండలు చేసేవాళ్లు, సుగంధ ద్రవ్యాలను సేకరించేవాళ్లను కలిసినప్పుడు -

పుడమితల్లి మహాఆత్మను మీ మధ్యకు ఆహ్వానించండి,

కొలబద్దలను, విలువనుకట్టే తూనికరాళ్లను దీవించమని అడగండి.

వట్టిచేతులతో వచ్చినవాళ్లని మీ లావాదేవీలలోకి లాగకండి, వాళ్లు తమ మాటలతో మీ శ్రమని కొంటారు.

అటువంటి వాళ్లతో ఈ విధంగా చెప్పండి:

"మాతోపాటు పొలం రండి, లేదా మా సోదరులతో కలసి సముద్రం మీదకి వెళ్లి వల విసరండి.

"మాకు ఇచ్చినట్లుగానే భూమి, సముద్రం మీకు అనంత సంపదలను ఇస్తాయి."

పాటలు పాడేవాళ్లు, ఆటలు ఆడేవాళ్లు, వేణుగాన కోవిదులు వస్తే వారి బహుమతులను కూడా కొనండి.

వాళ్లు కూడా పండ్లు, పూలు సేకరించే వాళ్లే. వాళ్ల సరుకులు కలలతో తయారయినప్పటికీ మీ ఆత్మకి అవి ఆహారం, ఆహార్యం.

సంతను వదిలివెళ్లే ముందు వట్టిచేతులతో ఎవరూ తిరిగి వెళ్లటం లేదని నిర్ధారించుకోండి.

మీలో అందరికంటే తక్కువవాని అవసరాలు తీరేంతవరకు పుడమి మహాఆత్మ గాలిపై ప్రశాంతంగా నిదురించదు.

అప్పుడు నగరంలోని న్యాయమూర్తులలో ఒకరు నిలబడి మాతో నేరమూ, శిక్షా గురించి మాట్లాడు అని అడిగాడు.

అతడు ఇలా బదులు చెప్పాడు:

గాలి మీద ఆత్మ విహారాలకు వెళ్లినపుడు మీరు ఒంటరిగా, నిఘా లేకుండా ఉండి ఇతరులపట్ల, ఫలితంగా మీపట్ల తప్పుకు పాల్పడతారు.

ఆ తప్పు చేసినందుకుగాను మీరు పుణ్యమూర్తుల తలుపు తట్టి ఏ బదులూరాక కొంతసేపు వేచి ఉండాల్సి ఉంటుంది.

మీలో దైవత్వం సముద్రం వంటిది;

అది ఎన్నటికీ మలినంకాదు.

గాలి మాదిరి అది రెక్కలు లేని వాటినే పైకిలేపుతుంది.

మీలో దైవత్వం సూర్యుడి వంటిది కూడా.

దానికి కీచురాళ్ల దారులు తెలియవు, పాము కన్నాలను ఆశ్రయించదు.

అయితే మీ దైవత్వం కేవలం మీ ఒక్కరిలోనే ఆశ్రయం పొందదు.

మీలో చాలావరకు మనిషి ఉన్నాడు, ఇంకా చాలా వరకు మనిషి కాలేదు,

అది రూపంలేని మరుగుజ్జులా నిద్దురలో మంచుతెరలలో నడుస్తూ తన మేలుకొలుపులను వెతుక్కుంటోంది.

ఇప్పుడు మీలోని మనిషి గురించి మాట్లాడతాను.

మీలోని దైవత్వానికీ, మరుగుజ్జుకీ కాక మనిషికే నేరమూ, ఆ నేరానికి శిక్షా తెలుసు.

తప్పు చేసినవాడు మీలో ఒకడు కానట్లు, అపరిచిత వ్యక్తి అయినట్లు, మీ ప్రపంచంలోకి చొరబడిన బయటి వ్యక్తి అయినట్లు మాట్లాడుకోవటం నేను తరచు విన్నాను.

మీ ప్రతి ఒక్కరిలోనూ ఉన్న శిఖరాలకంటే ఎత్తుకు అత్యంత నీతిమంతుడూ, పవిత్రుడూ ఎదగలేనట్లే,

మీ ప్రతి ఒక్కరిలోనూ ఉన్న పాతాళాలకంటే లోతుకు అత్యంత బలహీనుడూ, దుష్టుడూ పతనంకాలేడని నేనంటాను.

చెట్టు అంతటికీ ఎరుక లేకుండా ఒక్క ఆకు కూడా పండుబారనట్లే,

మీ అందరి రహస్య సమ్మతి లేకుండా ఏ ఒక్కడూ తప్పు చెయ్యలేడు.
ఒక ఊరేగింపులా మీ మంచితనానికేసి కలిసి నడుస్తుంటారు.
మీరే బాట, మీరే బాటసారులు.
మీలో ఒకడు పడిపోతే, అతడు దారికి అడ్డంగా ఉన్న రాయికి హెచ్చరికగా వెనకనున్న వారికోసం పడుతున్నాడు.
అంతేకాదు అతడు తనకు ముందున్న వారికోసం కూడా పడుతున్నాడు: వారు అతని కంటే వేగంగా, అడుగు తప్పకుండా నడవగలిగినప్పటికీ దారికి అడ్డంగా ఉన్న రాయిని తొలగించలేదు.

ఈ మాటలు మీ హృదయాలకు కష్టంగా అనిపించవచ్చు:
తన చావుకి చంపబడినవాడు కారకుడు.
దొంగతనానికి దొంగిలింపబడినవాడు నిందితుడు.
దుష్టుల చేతలకు మంచివాళ్లు నిందార్హులు.
దుర్మార్గుడి చేష్టలలో సన్మార్గుల పాత్ర ఉంటుంది.
ఔను, దోషి తరచు గాయపడిన వారి బలిపశువు.
నిర్దోషులు, మచ్చలేనివాళ్ల భారాన్ని దోషి మోస్తాడు.
మీరు న్యాయాన్నీ, అన్యాయాన్నీ; మంచివాళ్లనీ, దుష్టులనీ వేరుచెయ్యలేరు;

నల్లదారం, తెల్లదారం కలిపి నేయబడుతున్నప్పుడు అవి రెండూ కలిసి సూర్యునికి ఎదురుగా ఉంటాయి.

నల్లదారం తెగిపోయినప్పుడు నేతగాడు మొత్తం బట్టని చూస్తాడు, మగ్గాన్ని కూడా పరీక్షిస్తాడు.

దారితప్పిన భార్యని మీలో ఎవరైనా న్యాయస్థానం ముందు హాజరు పరిస్తే,

ఆమె భర్త హృదయాన్ని కూడా తూకం వెయ్యాలి, అతని ఆత్మనీ కొలవాలి.

తప్పుచేసినవాడిని కొరడాతో కొట్టే వ్యక్తి ఆ తప్పుకి గురయిన వ్యక్తి ఆత్మను చూడాలి.

రుజువర్తన పేరుతో శిక్షగా దుష్ట చెట్టును నరకబోయే ముందు దాని వేళ్లను చూడాలి:

పుడమి నిశ్శబ్దపు గుండెలో మంచివి, చెడువి; ఫలవంతము అయిన, ఫలవంతంకాని వేళ్లన్నీ ఒకదానితో ఒకటి పెనవేసుకుని ఉంటాయి.

న్యాయం చెప్పే న్యాయమూర్తులారా!

శరీరంలో నిజాయితీపరుడైనప్పటికీ ఆత్మలో దొంగ అయిన వ్యక్తికి ఏ తీర్పు చెబుతారు?

శరీరంలో చంపినప్పటికీ ఆత్మలో చంపబడిన వ్యక్తికి ఏ శిక్ష విధిస్తారు?

మోసగాడు, అణచివేసేవాడై ఉండీ
అన్యాయానికీ, మోసానికీ గురైన వ్యక్తిని ఏ రకంగా విచారిస్తారు?

తాము చేసిన తప్పులన్నింటికంటే అధికంగా పశ్చాత్తాపం చెందే వ్యక్తులను మీరు ఏరకంగా శిక్షిస్తారు?
పశ్చాత్తాపానికి మించి న్యాయాన్ని మీరు సేవ చేస్తున్న చట్టాలు ఇవ్వలేవు కదా?
అయినా, అమాయకులు పశ్చాత్తాపపడేలా మీరు చెయ్యలేరు, తప్పుచేసిన వాళ్లనుంచి దానిని తొలగించలేరు.
ఎవరూ పిలవకుండానే అది రాత్రిళ్లు వచ్చి, మనుషులను మేల్కొలిపి తమను తాము పరిశీలించుకునేలా చేస్తుంది.
న్యాయాన్ని అర్థం చేసుకునే మీరు అన్ని చర్యలను పూర్తి వెలుగులో చూడందే న్యాయం ఎలా చెబుతారు?
నిటారుగా నిలబడినవారూ, కిందపడినవారూ ఒకరేననీ; మరుగుజ్జు రూపమైన రాత్రికీ, దైవరూపమైన పగటికీ మధ్య సంధ్య వెలుగులో అతడు నిలబడి ఉన్నాడనీ అప్పుడుగానీ మీకు అర్థంకాదు.
దేవాలయపు ధ్వజస్థంభం దాని పునాదిలోని అట్టడుగు రాయి కంటే ఎత్తులో లేదు.

అప్పుడు ఒక వకీలు అయ్యా, మరి మా చట్టాల మాటేమిటి అన్నాడు.

అతడు ఇలా బదులిచ్చాడు:

చట్టాలు చేయడం మీకెంతో ఇష్టం,

వాటిని అతిక్రమించటాన్ని అంతకంటే ఇష్టపడతారు.

సముద్రతీరంలో ఇసకగూళ్లు కట్టి, వాటిని నవ్వుతూ పడదోసి ఆడుకునే పిల్లల మాదిరి చేస్తుంటారు.

మీరు ఇసకగూళ్లు కడుతుంటే, మరింత ఇసకను ఒడ్డుకు సముద్రం చేరుస్తూనే ఉంటుంది. ఆ గూళ్లను మీరు పడదోసినప్పుడు సముద్రమూ మీతోపాటు నవ్వుతుంది. నిజానికి సముద్రం ఎప్పుడూ అమాయకులతో కలసి నవ్వుతుంది.

అయితే జీవితం సముద్రమూ, మనిషి చేసిన చట్టాలు ఇసకగూళ్లూ కానివాళ్ల సంగతేమిటి?

జీవితం రాయిలాగా ఉండి, చట్టం ఆ రాయిపై చెక్కే ఉలి అయినవాళ్ల సంగతేమిటి?
నాట్యగాళ్లను తప్పు పట్టే వికలాంగుని సంగతేమిటి?
ఎద్దు తన కాడిని ప్రేమిస్తూ అడవిలో విహరించే జింక, దుప్పి దారి తప్పి నడుస్తున్నాయంటే?
తన కుబుసాన్ని విడవలేని ముసలి పాము మిగిలినవన్నీ నగ్నంగా ఉన్నాయనీ, సిగ్గులేనివనీ అంటే?
పెళ్లి భోజనానికి అందరికంటే ముందువచ్చి, పీకలదాకా తిని, అలసిపోయి తిరిగివెళుతూ విందులన్నీ అతిక్రమణలనీ, విందుకు వచ్చినవారందరూ చట్టాన్ని ధిక్కరించిన వారేనని అనే వాళ్ల సంగతేమిటి?

వాళ్లు కూడా ఎండలోనే నుంచున్నారనీ, కానీ వాళ్ల వీపులు ఎండకి తిప్పి ఉన్నాయనీ తప్ప వీళ్ల గురించి నేను ఏమి చెప్పను?
వాళ్లు తమ నీడలను మాత్రం చూడగలుగుతారు, వాళ్ల నీడలే వాళ్ల చట్టాలు. నీడలను సృష్టించేదిగా మాత్రమే సూర్యబింబం వాళ్లకి కనబడుతుంది.
ఇటువంటి చట్టాలను గుర్తించటమంటే కిందకి వంగి నేలపై ఈ నీడలను దిద్దటం కాక ఏమిటి?

కానీ, సూర్యునికి ఎదురుగా నిలబడి, ముందుకు నడిచే మిమ్మల్ని నేలపై ఏ నీడలు పట్టి ఉంచుతాయి?

గాలితో పయనించే మీకు ఏ గాలి సూచికలు దిశను నిర్దేశిస్తాయి?

మీ కాడిని ఏ మనిషి కారాగారం తలుపుల మీదా బద్దలు కొట్టనపుడు మిమ్మల్ని ఏ మానవ చట్టాలూ బంధింపలేవు.

మీరు నాట్యం చేస్తూ ఏ మనిషి కాలి సంకెళ్లమీద అడుగిడనప్పుడు ఏ చట్టాలకు భయపడనవసరంలేదు.

మీ బట్టలను చింపివేసి ఏ మనిషి దారికీ అడ్డుపడకుండా పారవేస్తే మిమ్మల్ని న్యాయస్థానం ముందు ఎవరూ నిలబెట్టరు.

ఆర్ఫలీస్ ప్రజలారా! మీరు మద్దెలను మూగపరచవచ్చు, వీణ తీగలను వదులుచేయవచ్చు. కానీ, పాడవద్దని ఆకాశపు పక్షిని ఎవరూ ఆజ్ఞాపించలేరుకదా?

అప్పుడు ఒక వ్యక్తి స్వేచ్ఛ గురించి మాట్లాడు అని అడిగాడు. అతడు బదులిచ్చాడు:

నగర ద్వారం దగ్గరా, మీ ఇంటిలో నెగడు పక్కనా సాగిలపడి మీ స్వేచ్ఛను మీరే పూజించటం నేను చూశాను:

తమను చంపినప్పటికీ బానిసలు వంగి వంగి నిలబడి నిరంకుశుడిని పొగుడుతారు.

దేవాలయపు తోపులలోనూ, కోట నీడలలోనూ మీలో అత్యంత స్వేచ్ఛాపరులైనవారు తమ స్వేచ్ఛను కాడిగానూ, సంకెళ్లుగానూ ధరించటం నేను చూశాను.

నా లోపల హృదయం స్రవించింది. స్వేచ్ఛను అందుకోవాలన్న కోరికకూడా మీకు బంధమౌతుంది. స్వేచ్ఛను ఒక లక్ష్యంగా, సాధించవలసిందిగా చూడనప్పుడే నిజంగా మీరు స్వేచ్ఛ పొందగలుగుతారు.

ఏ బాధ్యతలు లేకుండా మీ రోజులు ఉన్నప్పుడు, కోరికలూ, దుఃఖాలూ లేకుండా రాత్రులు ఉన్నప్పుడు మీరు స్వేచ్ఛ

పొందుతారు.

ఇవి మీ జీవితాన్ని చుట్టుముట్టినపుడు కూడా ఏ బంధాలు లేకుండా పైకి లేవ గలిగినపుడు నిజంగా స్వేచ్ఛ పొంద గలుగుతారు.

మీ అవగాహనల తొలి పొద్దులో మధ్యాహ్నాలకు బిగించిన సంకెళ్లను పగలగొట్టకపోతే పగళ్లను, రాత్రుళ్లను అధిగమించి పైకి ఎలా లేవగలుగుతారు?

నిజానికి మీరు స్వేచ్ఛ అంటున్నది వీటన్నింటిలోకి బలమైన గొలుసు, అది సూర్యకాంతిలో తళతళలాడుతూ మీ కళ్లను మిరుమిట్లు గొలుపుతుంది.

మీరు స్వేచ్ఛాపరులు కావాలంటే మీరు సృష్టించిన అంశాలనే వదిలివేయాలి.

మీ చేతితోనే మీ నుదుటి మీద రాసుకున్న అన్యాయపూరితమైన చట్టాన్ని తొలగించాలంటే ఆ చట్టాలను తగలపెట్టడం ద్వారా ఫలితముండదు. సముద్రంలోని నీళ్లన్నీ తెచ్చి గుమ్మరించినా మీ న్యాయమూర్తుల నుదుటినుంచి దానిని కడిగివెయ్యలేరు.

నిరంకుశుడిని అధికారంనుంచి తొలగించాలని పూనుకుంటే ముందుగా అతని కోసం మీ లోపల వేసిన సింహాసనాన్ని నాశనం చెయ్యాలి.

తమ స్వేచ్ఛలోనే నిరంకుశత్వం, తమ గర్వంలోనే సిగ్గు లేకపోతే ఆత్మగౌరవం కలిగి, స్వేచ్ఛాపరులైన వారిని ఒక నిరంకుశుడు ఎలా పరిపాలించగలడు?

బాధ్యతలను వదిలించుకోవాలనుకుంటుంటే, అవి మీపై రుద్దబడినవి కావు: మీకై మీరు నెత్తికెత్తుకున్నవి.

మీరు భయాన్ని పారద్రోలాలనుకుంటుంటే, దాని ఆసనం భయపెట్టేవాని చేతిలోకాక మీ హృదయంలో ఉంది.

కోరుకున్నది, భయపడేది; అసహ్యించుకునేది, ఆశించేది; వెంటాడేది, తప్పించుకోవాలనుకునేది - అన్నీ మీలోనే నిరంతరం ఒకదానినొకటి హత్తుకుని తిరుగుతుంటాయి.

వెలుతురు, నీడ అంటిపెట్టుకుని ఉన్నట్లే ఇవి మీలో సంచరిస్తుంటాయి.

నీడ మరుగై అంతరించిపోతే అక్కడే తచ్చట్లాడే వెలుతురు మరో వెలుతురికి నీడ అవుతుంది.

అదే విధంగా మీ స్వేచ్ఛ తన సంకెళ్లను వదిలించుకున్నప్పుడు అది మరో పెద్ద స్వేచ్ఛకి సంకెల అవుతుంది.

అప్పుడు సాధురాలు హేతువు, కాంక్షల గురించి మాట్లాడు అంది.

అతడు ఇలా బదులిచ్చాడు:

మీ కాంక్షలకూ, ఆకలికీ; మీ హేతువుకీ, తీర్పులకీ మధ్య జరిగే యుద్ధానికి మీ ఆత్మ తరచు వేదిక అవుతూ ఉంటుంది.

మీ ఆత్మలో శాంతి దూతనై ఒకదానితో ఒకటి విబేధిస్తూ, తలపడుతున్న అంశాలను ఒకటిగా చేసి, కమ్మని రాగం పలికించాలని నాకు ఉంది.

మీకై మీరు శాంతిదూతలు కానిదే, అన్ని అంశాలను ప్రేమించేవాళ్ళు కానిదే ఈ పని ఎలా చెయ్యగలను?

మీ ఆత్మ సముద్రయానం చేస్తుంటే మీ హేతువు చుక్కాని కాగా, కాంక్ష తెరచాప అవుతుంది.

తెరచాప చిరిగిపోయినా, చుక్కాని విరిగిపోయినా సముద్రం మీద అటు ఇటూ కొట్టాడుతారు. లేదా కదలకుండా

నిలిచిపోతారు.

హేతువే ప్రధానమనుకుంటే అది కట్టడిచేసే శక్తి అవుతుంది, కాంక్ష ఒక్కదానినే వదిలిపెడితే సర్వం కాల్చివేసే మంట అవుతుంది.

కాబట్టి కాంక్షల శిఖరాలను హేతువు చేరుకుని పాట పాడగలిగేలా మీ ఆత్మను అనుమతించండి;

కాంక్షను మీ హేతువుతో నిర్దేశించనివ్వండి; తన బూడిద నుంచే తిరిగి లేచే ఫోనిక్స్ మాదిరి కాంక్ష రోజూ పునర్జీవం పొందుతూ బతకనివ్వండి.

ఇంటికి వచ్చిన ఇద్దరు ప్రీతిపాత్రులైన అతిధుల మాదిరి మీ తీర్పులను, ఆకలిని చూడాలని కోరుకుంటున్నాను.

మీరు ఒక అతిధిని విస్మరించి మరొకరికి అధిక మర్యాదలు చెయ్యరుకదా; ఒకరిని ఎక్కువగా పట్టించుకుంటే ఇద్దరి ప్రేమా, నమ్మకాలను కోల్పోవటం ఖాయం.

కొండలలో పోప్లార్ చెట్ల నీడలో కూర్చుని దూరంగా ఉన్న పొలాలు, మైదానాల ప్రశాంతతని పంచుకుంటున్నప్పుడు "దేవుడు హేతువులో విశ్రమిస్తాడు," అని మీ హృదయం నిశ్శబ్దంగా అనుకోనివ్వండి.

తుపాను వచ్చి, బలమైన గాలులకు అడవి ఊగి, ఉరుములు, మెరుపులు అనంత ఆకాశాన్ని చాటినప్పుడు అబ్బురంతో

మీ హృదయం "దేవుడు కాంక్షలో కదలాడతాడు," అని అననివ్వండి.

మీరూ దేవుని పరిధిలోని ఒక ఊపిరి కాబట్టి, దేవుని అడవిలో ఒక ఆకు కాబట్టి మీరు కూడా హేతువులో విశ్రమించి, కాంక్షలో కదలాడాలి.

అప్పుడు ఒక మహిళ బాధ గురించి మాతో మాట్లాడు అంది.

అతడు ఇలా చెప్పాడు:

మీ అవగాహనను కప్పి ఉంచిన పెంకును పగలగొట్టడమే మీ బాధ.

తన హృదయం ఎండలో నిలబడాలంటే గింజ గూడు పగలక తప్పనట్లే మీరు కూడా బాధను తెలుసుకోవాలి.

రోజువారీ జీవితంలోని అద్భుతాలకు మీ గుండె అబ్బురపడేలా ఉంచుకోగలిగితే మీ సంతోషాలకు తీసిపోకుండా మీ బాధ కూడా మిమ్మల్ని అబ్బురపరుస్తుంది.

పొలాలమీద కాలాల ప్రవాహాన్ని ఆమోదించినట్లే మీ హృదయ కాలాలను కూడా ఆమోదిస్తారు.

మీ దుఃఖపు శీతాకాలం గడవటాన్ని అప్పుడు ప్రశాంతంగా గమనిస్తూ ఉంటారు.

మీ బాధలో అధిక భాగం మీరు ఎంచుకున్నదే. జబ్బు పడిన

మీ ఆత్మను నయం చేసేందుకు మీలోని వైద్యుడు ఇచ్చే చేదు కషాయం అది.

కాబట్టి వైద్యుడిని నమ్మి అతడిచ్చిన మందుని నిశ్శబ్దంగా, ప్రశాంతంగా తాగండి:

అతడి చెయ్యి బరువుగా, కఠినంగా ఉన్నప్పటికీ కనపడని లలితహస్తం దానికి దారి చూపుతోంది.

అతడు తెచ్చే పాత్ర మీ పెదవులను మండించినప్పటికీ తన పవిత్ర కన్నీటితో తడిపిన మట్టితో జగతిని తిప్పే కుమ్మరి దానిని తయారుచేశాడు.

అప్పుడు ఒక పురుషుడు ఆత్మజ్ఞానం గురించి మాకు చెప్పు అన్నాడు.

అతడు ఈ విధంగా బదులిచ్చాడు:

నిశ్శబ్దంలో మీ హృదయాలకు పగళ్లు, రాత్రుళ్ల రహస్యాలు తెలుసు.

కానీ, మీ చెవులు మీ హృదయ జ్ఞానపు సవ్వడుల కోసం తపించిపోతుంటాయి.

ఆలోచనల్లో ఎప్పుడూ తెలిసినవాటిని మీరు మాటల్లో తెలుసుకుంటారు.

మీ కలల నగ్న శరీరాలను చేతివేళ్లతో తాకుతారు.

మీరు అలా చెయ్యవలసిందే.

మీ ఆత్మలో దాగి ఉన్న బావి ఊట పైకెగసి గలగల మనుకుంటూ సముద్రాన్ని చేరాలి;

అనంత లోతుల నిధులు మీ కళ్లకు గోచరిస్తాయి.

అయితే మీ తెలియని నిధులని తూకం వెయ్యటానికి ఏ తక్కెడలూ తేవద్దు,
మీ జ్ఞానపు లోతులను తెలుసుకోటానికి ఏ కొలబద్దా తేవద్దు:
ఆత్మ అనేది అంతంలేని, కొలవలేని సముద్రం వంటిది.

"నేను అంతిమ సత్యాన్ని కనుగొన్నాను," అని అనవద్దు,
"ఒకానొక సత్యాన్ని కనుగొన్నాను," అనండి.
"ఆత్మకు దారిని కనుగొన్నాను," అని అనవద్దు,
"నా దారిలో నడుస్తుండగా ఆత్మను కలుసుకున్నాను," అనండి:
ఆత్మ అన్ని దారుల వెంట నడుస్తుంది.
ఆత్మ ఒక గీత వెంట నడవదు, అది రెల్లు మాదిరి పెరగదు.
అంతులేని రేకులు ఉన్న కమలం మాదిరి ఆత్మ తనను తాను తెలియపరుచుకుంటూ, విచ్చుకుంటూ ఉంటుంది.

అప్పుడు ఒక బోధకుడు మాకు బోధన గురించి చెప్పు అన్నాడు.

అతడు ఇలా చెప్పాడు:

మీ జ్ఞానపు తొలి సంధ్యలో నిద్రాణంగా లేనిదానిని ఎవరూ మీకు వెల్లడి చేయలేరు.

గుడి నీడలలో అనుచరులతో నడిచే ప్రబోధకుడు తన విజ్ఞతను పంచటం లేదు, తన నమ్మకాన్ని, ప్రేమని ఇస్తున్నాడు.

అతడు నిజంగా విజ్ఞుడైతే తన విజ్ఞత విడిదిలోకి మిమ్మల్ని ఆహ్వానించడు, మీ మనసులోని ప్రవేశద్వారాలకు మిమ్మల్ని చేరుస్తాడు.

ఖగోళ శాస్త్రజ్ఞుడు విశ్వంపై తన అవగాహన గురించి మీతో మాట్లాడగలడు, కానీ అతని అవగాహనను మీకివ్వలేడు.

అంతరిక్షం అంతటిలో ఉన్న రాగాన్ని ఒక సంగీత కళాకారుడు పాడి వినిపించగలడు, కానీ ఆ రాగాన్ని ఆపగల చెవినికానీ, దానిని ప్రతిధ్వనించే గొంతునుకానీ మీకివ్వలేడు.

అంకెల శాస్త్రం తెలిసినవాడు బరువులు, కొలతల పరిధి గురించి చెప్పగలడు కానీ మిమ్మల్ని అక్కడికి తీసుకెళ్లలేడు.

దేవుని జ్ఞానంలో మీరందరూ ఒంటరిగా నిలబడినట్లే దేవుని గురించి మీ జ్ఞానంలో, పుడమిని గురించి మీ అవగాహనలో ప్రతి ఒక్కరూ ఒంటరిగానే నిలవాలి.

అప్పుడు ఒక యువకుడు స్నేహం గురించి మాతో మాట్లాడు అన్నాడు.

అతడు ఈ విధంగా బదులిచ్చాడు:

మీ అవసరాలకు సమాధానమే మీ మిత్రుడు.

మీరు ప్రేమతో విత్తి, కృతజ్ఞతతో పంటకోసే పొలం అతడు. అతడు మీ భోజనం బల్ల, మీ నెగడు.

మీరు ఆకలితో అతని దగ్గరకొస్తారు, శాంతికోసం అతడిని చేరుకుంటారు.

మీ మిత్రుడు తన మనసు విప్పి మాట్లాడినపుడు మీ మనసులోని 'వ్యతిరేకత'కీ భయపడరు, 'అంగీకారం' పలకటానికీ వెనకాడరు.

అతడు నిశ్శబ్దంగా ఉన్నప్పుడు కూడా మీ గుండె అతడి గుండెను వింటూనే ఉంటుంది:

స్నేహంలో మాటలు లేకుండానే అన్ని ఆలోచనలు, అన్ని

కోరికలు, అన్ని ఆశలు ఎవరికీ తెలియని ఆనందంలో కలిసే పుడతాయి, కలిసి పంచుకోబడతాయి.

మీ మిత్రునినుండి దూరమైనప్పుడు కూడా మీరు దుఃఖించరు.

కొండనెక్కేవారికి శిఖరం దూరంనుంచి మరింత స్పష్టంగా కనపడినట్లు, అతనిలో మీరు ఎంతగానో ప్రేమించేది అతడి పరోక్షంలోనే మరింత స్పష్టంగా కనపడవచ్చు.

ఆత్మను మరింతగా విస్తృత పరిచేందుకు తప్పించి స్నేహానికి మరో ఉద్దేశాన్ని తలపెట్టవద్దు.

తన మర్మాలను వెల్లడి చేయడానికి మించి మరేదో పట్టుకుందామని ప్రేమ కోరుకుంటే అది ప్రేమ కాదు, విసిరిన వల అవుతుంది: అందులో లాభం లేనివి తప్ప మరేమీ పడవు.

మిత్రునికి మీలో అత్యుత్తమమైనది కేటాయించండి.

ప్రవాహపు ఆటు అతడికి తెలియచేయాలంటే, దాని పోటు కూడా అతడికి తెలియనివ్వండి.

సమయాన్ని వృధాగా గడిపేందుకు స్నేహితుడిని ఆశ్రయిస్తున్నారా?

సమయాన్ని సజీవంగా చేసేటందుకు అతడి సహచర్యాన్ని కోరుకోండి.

అతడు మీ అవసరాలని నింపాలి కానీ శూన్యాలని కాదు.
స్నేహ మాధుర్యంలో నవ్వులు, సంతోషం పంచుకోటాలు ఉండనివ్వండి.
చిన్ని చిన్న విషయాల మంచుతెరలలోనే హృదయం తన ఉదయాలను కనుగొని తిరిగి తేజోవంతమౌతుంది.

అప్పుడు ఒక విద్వాంసుడు మాట్లాడటం గురించి చెప్పండి అన్నాడు.

అతడు ఇలా బదులిచ్చాడు:

మీ ఆలోచనలతో ప్రశాంతంగా ఉండలేనప్పుడే మాట్లాడతారు; మీ హృదయపు ఒంటరితనంలో ఉండలేనప్పుడే మీ పెదాలపై జీవిస్తారు, శబ్దం కాలక్షేపం అవుతుంది, పక్కదారి పట్టిస్తుంది.

మాటలలో సగం ఆలోచనలు చంపబడతాయి.

ఆలోచన వినీలాకాశపు పక్షి. మాటల పంజరంలో అది రెక్కలు విప్పుకోగలదేమో కానీ ఎగరలేదు.

ఒంటరితనం భయంతో మీలో కొందరు వదరుబోతుల సహచర్యాన్ని కోరుకుంటారు.

ఒంటరితనపు నిశ్శబ్దం తమ నగ్న రూపాలు కంటికి కనబడేలా చేస్తుంది కాబట్టి దాని నుంచి తప్పించుకుందామనుకుంటారు.

కొంతమంది తమ జ్ఞానం లేకుండానే, ముందు ఆలోచన

లేకుండానే తమకు కూడా అవగాహన కాని సత్యాన్ని వెల్లడి చేస్తారు.
మరికొంతమందికి తమలోని సత్యం తెలుసుకానీ వారు దానిని మాటల్లో చెప్పరు.
ఇటువంటి వారి హృదయాల్లో లయబద్ధమైన నిశ్శబ్దంలో ఆత్మ నివసిస్తుంది.

సంతలోగానీ, దారి పక్కనగానీ మిత్రుడిని కలిసినప్పుడు మీలోని ఆత్మ మీ పెదాలను కదల్చనివ్వండి, మీ నాలుకను నిర్దేశించనివ్వండి.
మీ గొంతుకలోని గొంతుకను అతని చెవిలోని చెవితో మాట్లాడనివ్వండి;
రంగు వెలిసిపోయి, పాత్ర లేకపోయినప్పటికీ మద్యం రుచి గుర్తున్నట్లు, అతడి ఆత్మ మీ హృదయపు సత్యాన్ని దాచి ఉంచుతుంది.

అప్పుడు ఖగోళ శాస్త్రజ్ఞుడు అయ్యా, మరి సమయం ఏమిటి అన్నాడు.

అతడు బదులు చెప్పాడు:

కొలతలులేని, కొలవలేని కాలాన్ని మీరు కొలవబోతారు.

కాలాల ప్రకారం, ఘడియల ప్రకారం మీ ప్రవర్తనను మార్చుకుంటారు, ఆత్మ గతులను కూడా నిర్దేశిస్తారు.

కాలాన్ని వాగుగా చేసి దాని ఒడ్డున కూర్చుని అది ప్రవహించి పోతూ ఉంటే చూస్తూ ఉంటారు.

అయినప్పటికీ మీలోని కాలంలేని దానికి జీవితపు కాలంలేని తనం తెలుసు;

నిన్న అన్నది నేటి జ్ఞాపకమనీ, రేపు అన్నది నేటి కల అనీ దానికి తెలుసు.

నక్షత్రాలను విశ్వంలో వెదజిమ్మిన ఆ తొలి క్షణాల పరిధిలో మీలో ఆలోచనలు చేసేది, పాటలు పాడేది ఇప్పటికీ జీవిస్తూనే

ఉంది.

తనలోని ప్రేమశక్తి అనంతమైనదని ఎవరు మాత్రం గుర్తించకుండా ఉంటారు?

ప్రేమ ఆలోచనల నుంచి ప్రేమ ఆలోచనలకూ, ప్రేమ చర్యల నుంచి ప్రేమ చర్యలకూ కదలకుండా తన కేంద్రకంలో ఇమిడిఉన్న అనంతమైన ప్రేమ ఉంటుందని కూడా గుర్తించే ఉంటారు.

ప్రేమ మాదిరి కాలం కూడా అవిభాజ్యమైనదీ, అంతంలేనిదీ కాదా?

అయితే సమయాన్ని కాలాల్లో కొలవాలంటే ప్రతి కాలం మిగిలిన అన్ని కాలాలను ఇముడ్చుకోనివ్వండి,

గత జ్ఞాపకాలతో, భవిష్యత్తు ఎదురుచూపులతో ఈ రోజుని పెనవేయండి.

నగరం పెద్దల్లో ఒకరు మంచి, చెడుల గురించి చెప్పండి అని అడిగాడు.

అతడు ఇలా బదులిచ్చాడు:

మీలో మంచి గురించి నేను మాట్లాడగలను. కానీ చెడు గురించి మాట్లాడలేను.

తన ఆకలిదప్పులతో బాధింపబడిన మంచితనమే చెడు అవుతుంది తప్ప మరొకటి కాదు.

ఆకలిగొన్నప్పుడు చీకటి గుహలలో సైతం ఆహారం కోసం మంచి వెతుకుతుంది, దప్పికగొన్నప్పుడు మృత నీటిని సైతం తాగుతుంది.

మీలో మీరు ఏకమై ఉన్నప్పుడు మంచివాళ్లు.

మీలో మీరు ఏకం కాకుండా ఉన్నప్పుడు మీరు చెడ్డవాళ్లు కారు:

వేరుబడ్డ ఇల్లు దొంగల నిలయం కాదు, అది వేరుబడ్డ ఇల్లు

మాత్రమే.

చుక్కాని లేని ఓడ ప్రమాదకరమైన దీవుల మధ్య గమ్యం లేకుండా తిరుగుతుండవచ్చు, కానీ సముద్రం అడుగుకి మునిగిపోదు.

మిమ్మల్ని అర్పించుకోటానికి ప్రయత్నించినపుడు మంచివాళ్లు.

మీ లాభం కోసం ప్రయత్నించినపుడు మీరు చెడ్డవాళ్లు కాదు: మట్టిని పట్టుకుని దాని రొమ్ముని కుడిచే వేరు వంటి వాళ్లు.

వేరుతో "నాలాగా నిండుగా, తయారుగా ఉండు, నీ సంపదలను ఇతరులకు ఇస్తూ ఉండు," అని పండు అనలేదు.

పండుకి ఇవ్వటం అవరసమైనట్లే వేరుకి తీసుకోవడం అవసరం.

మాటలలో మీరు పూర్తి మెలకువగా ఉన్నప్పుడు మంచివాళ్లు.

ఏ లక్ష్యమూ లేకుండా మీ నాలుక విహరిస్తున్నప్పుడు మీరు నిద్రించినా చెడ్డవాళ్లు కాదు.

తడబడే మాట సైతం బలహీనమైన నాలుకను బలపరచవచ్చు.

స్థిరమైన, పెద్ద అంగలతో గమ్యంకేసి నడుస్తుంటే మీరు మంచివాళ్లు.

మీరు కుంటుకుంటూ ఆ మార్గంలో నడిచినప్పటికీ చెడ్డవాళ్లు కాదు.

కుంటుకుంటూ నడిచేవాళ్లు సైతం వెనక్కి నడవరు.
కానీ బలిష్టులు, వేగంగా నడిచేవాళ్లు దయచూపుతున్నాం అనుకుంటూ అవిటివాళ్ల ముందు కుంటుకుంటూ నడవవద్దు.

మీరు అనేకవిధాలుగా మంచివాళ్లు, మీరు మంచి వాళ్లుగా లేనప్పుడు చెడ్డవాళ్లు కాదు,
మీరు తచ్చట్లాడుతున్నారు, నత్తనడకన పోతున్నారు.
తాబేళ్లకు వేగంగా పరిగెత్తడం దుప్పులు నేర్పించలేవు కదా!

మీ బృహత్ ఆత్మ పట్ల కోరికే మంచితనం, ఆ కోరిక మీ అందరిలోనూ ఉంది.
కొందరిలో ఆ కోరిక ఉరకలెత్తే నది మాదిరి తనతో కొండవాలుల రహస్యాలను, అడవుల పాటలను తీసుకు వెళుతూ సముద్రాన్ని చేరుకుంటున్నట్లు ఉంటుంది.
మరికొందరిలో అది సముద్రాన్ని చేరే ముందు తేటనీటితో వంపులు తిరుగుతూ, హొయలు పోయే నదీపాయ మాదిరి ఉంటుంది.
కోరిక తీవ్రంగా ఉన్న వాళ్లు, అంత తీవ్రత లేనివాళ్లని "ఏమిటి

అడుగులో అడుగు వేసుకుంటూ, ఆగుతూ వస్తున్నావు?''
అని అడగకూడదు.

నగ్నంగా ఉన్నవారిని "నీ బట్టలు ఏవి?'' అనీ, ఇల్లులేని వారిని "నీ ఇల్లు ఏమైంది?'' అనీ నిజంగా మంచివాళ్లు అడగరు.

అప్పుడు ఒక పూజారిణి ప్రార్థన గురించి మాతో మాట్లాడు అని అడిగింది.

అతడు ఇలా బదులిచ్చాడు:

మీరు బాధలలోనూ, అవసరాలలోనూ ప్రార్థన చేస్తారు; సంపదలలో తూగుతున్నప్పుడు, ఆనందంలో పొంగి పొర్లుతున్నప్పుడు కూడా ప్రార్థన చేస్తే బాగుండును.

మీ ఆత్మ సజీవమైన గాలిలోకి విస్తరించేలా ప్రార్థన చేస్తుంది. మీ చీకట్లను విశ్వంలోకి ఒంపటం ఎలా ఓదార్పును ఇస్తుందో, మీ హృదయపు తొలిపొద్దులను కూడా ఒంపటం ఆనందాన్ని ఇస్తుంది.

మీ ఆత్మ మిమ్మల్ని ప్రార్థనకి పిలిచినప్పుడు ఏడుస్తూ తప్ప రాకపోతే, మీరు ఏడుస్తూ ఉన్నప్పటికీ నవ్వుతూ వచ్చేదాకా అది మళ్లీ మళ్లీ పిలవాలి.

మీరు ప్రార్థన చేస్తున్నప్పుడు పైకి లేచి అదే సమయంలో

ప్రార్థన చేస్తున్న వారిని గాలిలో కలుస్తారు. ప్రార్థనలో తప్ప వారిని మీరు కలవలేరు.

కాబట్టి కనపడని ఆ గుడికి మీ రాక ఆ తీయని కలయిక, ఆనందానుభూతులకోసమే కావాలి.

అడగటానికే ఆ గుడిలోకి అడుగుపెడితే మీరు ఏమీ అందుకోలేరు.

మిమ్మల్ని చిన్నబుచ్చుకోటానికి గుడిలోకి వెళితే మీరు పైకి లేపబడరు.

ఇతరుల మంచి కోరుతూ ఆ గుడిలోకి వెళ్లినా మీ మొర వినే వాళ్లు ఉండరు.

కనపడని ఆ గుడిలోకి మీరు ప్రవేశిస్తే చాలు.

మాటలతో ఎలా ప్రార్థించాలో మీకు నేర్పలేను.

మీ పెదాల ద్వారా అతడు పలికినప్పుడు తప్పించి దేవుడు మీ మాటలు వినడు.

సముద్రాలు, అడవులు, కొండల ప్రార్థనలను మీకు నేర్పలేను. కొండలు, అడవులు, సముద్రాల బిడ్డలైన మీరు మీ గుండెలలో వాటి ప్రార్థనలను వినగలుగుతారు.

నిశ్చలంగా ఉండే రాత్రిళ్లను ఆలకిస్తే నిశ్శబ్దంగా అవి పలికే మాటలు వినపడతాయి:

“మా ఆత్మలకు రెక్కలు తొడిగిన ఓ ప్రభువా, నీ కోరికే మాలో కోరికగా పుడుతోంది.

“నీ కాంక్షే మాలో కాంక్షిస్తోంది.

“నీ వాంఛ కారణంగానే మాలోని రాత్రులు రోజులుగా మారుతున్నాయి; ఆ రాత్రులు, రోజులూ కూడా నీవే.

“మేము నిన్నేమి కోరుకోం, మాలో అవసరాలు పుట్టకముందే అవి నీకు తెలుసు:

“నీవే మా అవసరం; నిన్ను మాకు మరింతగా ఇచ్చుకోవటం ద్వారా మాకు సమస్తమూ ఇస్తున్నావు.”

అప్పుడు సంవత్సరానికి ఒకసారి ఆ నగరానికి వచ్చే సాధువు ముందుకువచ్చి ఆనందం గురించి చెప్పు అని అడిగాడు.

అతడు ఇలా బదులిచ్చాడు:

ఆనందం అనేది స్వేచ్ఛాగానం,

కానీ, అది స్వేచ్ఛ కాదు.

అది మీ కోరికలు విరబూయటం,

కానీ, దాని ఫలం కాదు.

శిఖరాలను పిలుస్తున్న లోయ అది,

కానీ, అది ఎత్తూ కాదు, లోతూ కాదు.

అది పంజరంలో బంధింపబడినది ఎగిరిపోవటం,

కానీ, అది విశ్వాన్ని ఇముడ్చుకోవటం కాదు.

నిజానికి ఆనందం అన్నది స్వేచ్ఛాగానం.

మీ హృదయమంతటితో ఆ పాటను పాడండి; కాని పాడటంలో హృదయాన్ని పోగొట్టుకోవద్దు.

యువతలో కొంతమంది ఆనందమే సమస్తమన్నట్లుగా దానిని కోరుకుంటారు, అటువంటి వారిని మీరు తిడతారు, తప్పుబడతారు.

వారిని నేను తిట్టను, తప్పుబట్టను; వారు కోరుకోవాలంటాను.

వారికి ఆనందం దొరుకుతుంది, అయితే ఆమె ఒక్కతే కాదు:

ఆమె అప్పచెల్లెళ్లు ఏడుగురు, వారందరిలోకి తక్కువది ఆనందం కంటే అందంగా ఉంటుంది.

దుంపల కోసం మట్టిని తవ్వుతున్న మనిషికి నిధి దొరికిందన్న విషయం మీరు వినలేదా?

తాగినప్పుడు చేసిన తప్పులుగా ఆనందాలను గుర్తు తెచ్చుకొని మీలో వృద్ధులు కొందరు బాధపడతారు.

పశ్చాత్తాపమన్నది మనస్సును కమ్మే మబ్బు వంటిది, అది దానిని శుభ్రపరచదు.

వేసవికాలపు పంటను కృతజ్ఞతతో గుర్తుంచుకున్నట్లుగా వాళ్లు తమ ఆనందాలను గుర్తుంచుకోవాలి.

కానీ పశ్చాత్తాపపడటం వాళ్లకి సంతృప్తినిస్తే, వారిని సంతృప్తి పడనివ్వండి.

మీలో కొందరు కోరికలతో ఊగే యువతా కాదు, జ్ఞాపకాలతో బతికే వృద్ధులూ కారు.

ఆత్మను విస్మరిస్తామేమో, అవమానిస్తామేమోనని కోరు కోటానికీ, గుర్తుంచుకోటానికీ భయపడి అన్ని ఆనందాలను వారు తిరస్కరిస్తారు.

అయితే వాటిని కాదనుకోవటంలోనే వారి ఆనందం ఉంది.

దుంపలకోసం వాళ్లు వణుకుతున్న చేతులతో తవ్వినప్పటికీ వాళ్లూ తమ నిధిని కనుగొంటారు.

అయితే ఆత్మను ఎవరు అవమానించగలరు చెప్పండి?

కోకిల తన రాగాలతో రాత్రి నిశ్శబ్దాన్ని అవమానించగలదా, తారలను మిణుగురులు అవమానపరచగలవా?

మీ మంటలు, పొగలు గాలికి భారంగా మారతాయా?

కర్ర పుల్లతో కలకలం రేపేటందుకు ఆత్మ నీటి గుంట అని పొరబడుతున్నారా?

ఆనందాన్ని తిరస్కరించినపుడు తరచు మనస్సు మారుమూలల్లో కోరికను దాచి ఉంచుతారు.

ఈ రోజు మరుగుపడిందనుకున్నది రేపటి కోసం ఎదురు చూస్తోందేమో ఎవరికి తెలుసు?

మీ శరీరానికి కూడా దాని వారసత్వం తెలుసు, న్యాయపరమైన అవసరాలు తెలుసు; దానిని మోసపుచ్చలేరు.

ఆత్మకి తుంబుర వంటిది మీ శరీరం.

దానినుంచి తియ్యని సంగీతం పలికిస్తారో, గందరగోళం సృష్టిస్తారో మీ చేతుల్లో ఉంది.

"ఆనందంలో మంచిదేదో, కానిదేదో ఎలా గుర్తించగలుగుతాం?" అని కొంతమంది ప్రశ్నిస్తారు.

పొలాలకు, తోటలకు వెళ్లండి; పూల మకరందాన్ని సేకరించటం తేనెటీగకు ఆనందం అని మీరు తెలుసుకుంటారు.

తమ మకరందాన్ని తేనెటీగకు ఇవ్వటం పువ్వుకి కూడా ఆనందమే.

తేనెటీగకు పువ్వు జీవితపు జలపాతం;

పువ్వుకి తేనెటీగ ప్రేమదూత,

ఆనందం ఇవ్వటం, పుచ్చుకోటాలు తేనెటీగకీ, పువ్వుకీ అవసరమే కాకుండా, సంతృప్తిని కూడా ఇస్తాయి.

ఆర్ఫలీస్ ప్రజలారా! మీ ఆనందంలో తేనెటీగలు, పూల మాదిరి ఉండండి.

అప్పుడు కవి అందం గురించి మాట్లాడండి అని అడిగాడు. అతడు బదులిచ్చాడు:

మీ దారిగా ఉండి, దారిచూపేదిగా ఉంటే తప్పించి అందాన్ని ఎక్కడ వెతుకుతారు, ఎలా కనుగొంటారు?

మీ మాటలను ఆమె అల్లితే తప్పించి ఆమెను ఎలా వర్ణించగలరు?

దుఃఖితులూ, గాయపడినవాళ్లూ "అందం దయగలది, మృదువుగా ఉంటుంది.

"తన మాతృత్వపు గర్వంతో సగం సిగ్గుతో ఉండే యువతిలాగా ఆమె మన మధ్య తిరుగుతుంటుంది," అంటారు.

కోరికతో కూడుకున్న వాళ్లు "కాదు, అందం శక్తిమంతమైనది, భయంగొలుపుతుంది.

"తుపాను మాదిరి ఆమె మన కాళ్ల కింద భూమినీ, మన పైన ఆకాశాన్నీ కుదిపివేస్తుంది," అంటారు.

అలసిపోయినవాళ్లూ, విసుగుచెందినవాళ్లూ "అందం గుసగుసలతో మెత్తగా ఉంటుంది. ఆమె మన ఆత్మతో మాట్లాడుతుంది.

"నీడకు భయపడి వణికే మసక కాంతిలాగా మన నిశ్శబ్దాలకు ఆమె గొంతు బదులు పలుకుతుంది," అంటారు.

ఆందోళనతో ఉండేవారు "ఆమె కొండలలో అరవటం మేం విన్నాం.

"ఆమె అరుపులతో పాటు గిట్టల చప్పుడు, రెక్కల సవ్వడి, సింహాల గర్జన వినిపించాయి," అంటారు.

రాత్రుళ్లు నగరాన్ని కాపలా కాసే వ్యక్తి "తొలిపొద్దుతో పాటు అందం తూర్పున ఉదయిస్తుంది," అంటాడు.

కష్టజీవులూ, బాటసారులూ సాయం సంధ్యలో "సూర్యాస్తమయపు కిటికీల నుండి ఆమె పుడమిపైకి తొంగి చూడటం మేం చూశాం," అంటారు.

శీతాకాలంలో మంచుతో కప్పబడిన వాళ్లు "ఆమె వసంతంతోపాటు కొండల నుంచి దుముకుతూ వస్తుంది," అంటారు.

వేసవి తాపంలో పంటలు కోసేవాళ్లు "శిశిరపు ఆకులలో ఆమె నాట్యం చేస్తూ ఉండటం మేం చూశాం, ఆమె

కురులలో మంచు తెరలు ఉన్నాయి," అంటారు.

అందం గురించి ఇవన్నీ మీరు చెప్పారు.

అయితే అందం గురించి కాక మీ తీరని అవసరాల గురించి చెప్పారు.

అందం అవసరం కాదు, ఆనందాతిరేకం.

అది నోరు దప్పికగొనటం కాదు, రిక్తహస్తం ముందుకు చాచటం కాదు.

అది రగులుతున్న గుండె, ముప్పిరిగొన్న ఆత్మ.

అందం మీరు చూడగల బొమ్మకాదు, వినగల పాట కాదు, కానీ

మీరు కళ్లు మూసుకున్నా కనిపించే బొమ్మ, చెవులు మూసుకున్నా వినపడే పాట.

అది చెట్టు బెరడులోని రసం కాదు, గోరుకి జత చేయబడిన రెక్కకాదు.

అన్ని కాలాలలో విరబూసి ఉండే తోట అది, నిరంతరం ఎగురుతుండే దేవదూతల బృందం అది.

ఆర్ఫలీస్ ప్రజలారా! తన పవిత్ర ముఖం నుండి ముసుగు తొలగించిన జీవితమే అందం.

కానీ ఆ జీవితం మీరు, ఆ ముసుగూ మీరే.

అద్దంలో తనను తాను చూసుకుంటున్న శాశ్వతత్వం అందం.

కాని ఆ శాశ్వతత్వం మీరు, ఆ అద్దమూ మీరే.

అప్పుడు ఒక వృద్ధ పూజారి మతం గురించి మాట్లాడు అన్నాడు.

అతడు ఇలా చెప్పాడు:

ఈ రోజు నేను మతం గురించి కాకుండా ఇంకా ఏమి చెప్పాను?

అన్ని పనులు, అన్ని ఆలోచనలు కాక మతం మరేమిటి?

పనులూ కాక, అన్ని ఆలోచనలూ కాక చేతులు రాతిని చెక్కుతూనో, మగ్గాన్ని ఆడిస్తూనో ఉన్నప్పటికీ ఆత్మలో ఎల్లప్పుడూ ఉబుకుతుండే ఆశ్చర్యం, అబ్బురం మతం కాక మరేమిటి?

ఒకరి విశ్వాసాన్ని వారి చర్యలనుంచి, ఒకరి నమ్మకాలను వారి వృత్తులనుంచి ఎవరు వేరుచెయ్యగలరు?

తన ముందు గంటలను పరుచుకుని "ఇవి దేవుడికి, ఇవి నాకు; ఇవి నా ఆత్మకు, ఇవి నా శరీరానికి," అని ఎవరైనా విడదీయగలరా?

ఆత్మ నుంచి ఆత్మకి శూన్యంలో కొట్టుకులాడే రెక్కలు మీ గంటలన్నీ.

నీతినే వస్త్రంగా తొడుక్కున్నవాడు నగ్నంగా తిరిగినా ఏమీ కాదు.

గాలి కానీ, సూర్యుడు కానీ అతడి చర్మాన్ని తూట్లు పొడవలేవు.

తన ప్రవర్తనను నీతి సూత్రాల ద్వారా నియంత్రించుకునే వ్యక్తి తన పాట పిట్టను పంజరంలో బంధిస్తున్నాడు.

చువ్వలు, తీగల మధ్యనుంచి స్వేచ్ఛాయుతమైన పాట పలకదు.

ప్రార్థన చేయటమంటే తెరిసీ, మూసే కిటికీ అనుకునే వ్యక్తి తన ఆత్మ ఇంటిని ఇంకా సందర్శించలేదు: దాని కిటికీలు తొలి సంధ్యనుంచి మలి సంధ్య వరకు విస్తరించి ఉంటాయి.

మీ రోజువారి జీవితమే మీ గుడి, మీ మతం.

అందులోకి ప్రవేశించే ప్రతిసారీ మీ సర్వస్వం మీ వెంట తీసుకెళ్లండి.

నాగలిని, సుత్తిని, రోకలిని, వేణువుని తీసుకెళ్లండి,

అవసరానికో, మోజుపడో తయారుచేసిన వస్తువులనన్నింటినీ తీసుకెళ్లండి.

మీరు సాధించినదానికి మించి పైకి ప్రార్థనలో ఎగరలేరు.
మీ వైఫల్యాలకు మించి కిందికి పడిపోలేరు.
మీతోపాటు మీ మనుషులనందరినీ తీసుకెళ్లండి:
మీ ఆరాధనలో వారి ఆశలకు మించి ఎత్తు ఎగరలేరు, వారి నిరాశలకు మించి కిందికి జారలేరు.

మీకు దేవుడు ఎరుకపడితే చిక్కుముడులను పరిష్కరించే ప్రయత్నం చేయవద్దు.
మీ చుట్టుపక్కల పరికిస్తే అతడు పిల్లలతో ఆడుకుంటూ ఉండటం కనపడుతుంది.
ఆకాశంలోకి చూడండి. అతడు మబ్బులలో నడుస్తూ కనపడతాడు: అతని చేతులు మెరుపులనుతాకుతూ ఉంటాయి, వానతోపాటు అతడు కిందికి వస్తుంటాడు.
అతడు పువ్వులలో నవ్వుతూ కనపడతాడు, తరవాత పైకి లేచి చెట్లలో చేతులు ఊపుతూ ఉంటాడు.

అప్పుడు అల్‌మిత్రా మాట్లాడింది: ఇప్పుడు మేం మరణం గురించి అడుగుతున్నాం.

అతడు ఇలా చెప్పాడు:

మీకు మరణ రహస్యం తెలుస్తుంది.

అయితే జీవితపు హృదయంలో వెతికితే తప్పించి మీకది కనపడదు.

రాత్రిళ్లు తిరిగే గుడ్లగూబ పగటి వెలుతురుకు గుడ్డిగా ఉండి కాంతి మర్మాలను ఆవిష్కరించలేదు.

మరణ ఆత్మను పట్టుకోవాలని ఉంటే మీ గుండెను జీవితపు శరీరానికి బార్లా తెరవాలి:

నదీ, సముద్రమూ ఒకటే అయినట్లు మరణమూ, జీవితమూ కూడా ఒకటే.

మీ ఆశలు, కోరికల లోతులలో ఆవలివైపునకు సంబంధించిన నిశ్శబ్ద జ్ఞానం దాగి ఉంటుంది.

మంచుకింద కలలుకనే విత్తనంలా మీ హృదయం వసంతం గురించి కలలు కంటుంది.

ఆ కలలను నమ్మండి, శాశ్వతత్వానికి దారితీసే తలుపు వాటిల్లోనే దాగి ఉంది.

సన్మానింపబడటానికి రాజు ముందు నిలబడి గొర్రెల కాపరి వణుకుతుంటాడు. చావు అంటే నీ భయం అటువంటిదే.

తన వణుకు వెనక రాజుగారి ముద్ర ధరిస్తానన్న సంతోషం గొర్రెల కాపరికి లేదా?

అయినప్పటికీ వణుకే అతడిని ఎక్కువగా ఆవహించలేదా?

గాలిలో నగ్నంగా నిలబడి ఎండలో కరిగిపోవటమే మరణం.

ఊపిరి ఆగిపోవటం అంటే అది నిరాటంకంగా విస్తరించి దేవుని చేరుకునేలా ఉఛ్వాస నిశ్వాసాలనుంచి విముక్తం కావటం.

నిశ్శబ్దపు నదినుంచి తాగినప్పుడే మీరు నిజంగా పాడ గలుగుతారు.

కొండశిఖరాన్ని చేరుకున్న తరవాతే పైకి ఎక్కటం మొదలు అవుతుంది.

భూమి మీ అంగాలను పొదువుకున్న తరవాతే మీరు నిజంగా నాట్యమాడగలుగుతారు.

సాయంత్రమయ్యింది.

ఈ రోజు, ఈ స్థలం, మాట్లాడిన నీ ఆత్మ ధన్యమయ్యాయి అంది సాధురాలు అల్‌మిత్ర.

అతడు బదులిచ్చాడు: నేనేనా మాట్లాడింది?

నేను కూడా శ్రోతను కానా?

అతడు గుడి మెట్లు దిగి వచ్చాడు. అతడిని ప్రజలందరూ అనుసరించారు. అతడు తన ఓడను చేరుకుని దాని మీదకి ఎక్కాడు.

ప్రజలవైపుకి తిరిగి గొంతెత్తి ఇలా అన్నాడు:

ఆర్ఫలీస్ ప్రజలారా! గాలి మీకు వీడ్కోలు చెప్పమంటోంది. గాలికున్నంత తొందర నాకు లేదు, అయినా నేను వెళ్లాలి. మేం దేశదిమ్మరులం, ఎప్పుడూ ఒంటరిదారిని వెతుకుతుంటాం. ఒక రోజు అంతం అయినచోట మరొక రోజు మొదలుపెట్టం, మలిపొద్దు విడిచిన చోట ఏ తొలి పొద్దూ

మమ్మల్ని తిరిగి చూడదు.

పుడమి నిద్రిస్తున్నప్పుడు కూడా మేం ప్రయాణం చేస్తూ ఉంటాం.

మేం మొండి మొక్క విత్తులం: పరిపక్వతలో, హృదయ పరిపూర్ణతలో మేం గాలిలో చెల్లాచెదురు చేయబడతాం.

నేను మీ మధ్య గడిపిన కాలం చాలా తక్కువ. మీతో మాట్లాడిన మాటలు మరీ తక్కువ.

నా గొంతుక మీ చెవులలో మూగబోయినప్పుడూ, నా ప్రేమ మీ జ్ఞాపకాలలో మాయమైపోయినప్పుడూ మళ్లీ వస్తాను.

అప్పుడు మరింత సుసంపన్నమైన హృదయంతో, పెదవులతో ఆత్మకు మరింత అంకితమవుతూ మాట్లాడతాను.

అవును, అలలతో  నేను మళ్లీ తిరిగి వస్తాను.

చావు నన్ను దాచిపెట్టినప్పటికీ, పెను నిశ్శబ్దం నన్ను చుట్టివేసినప్పటికీ మళ్లీ మీ అవగాహనను కోరుకుంటాను.

నా కోరిక వృథా కాదు.

నేను చెప్పినది నిజం అయితే మరింత స్పష్టమైన గొంతుకతో, మీ ఆలోచనలకు మరింత చేరువగా ఉండే మాటలతో ఆ నిజం తనను తాను మీకు తెలియబరుచుకుంటుంది.

ఆర్ఫలీస్ ప్రజలారా నేను గాలితోపాటు పయనిస్తున్నాను, శూన్యంలోకి కాదు.

ఈ రోజు మీ అవసరాలను, నా ప్రేమను పరిపూర్ణం చేయలేకపోతే మరో రోజుకి మాట ఇచ్చుకుందాం.

మనిషి అవసరాలు మారతాయి, కాని ప్రేమ మారదు. ప్రేమ తమ అవసరాలను తృప్తిపరచాలన్న కోరిక మారదు.

కాబట్టి పెను నిశ్శబ్దంనుంచి నేను తిరిగివస్తానని తెలుసుకోండి. ఆకులమీద కొన్ని బిందువులు మిగిల్చి తొలి పొద్దుకి తొలగిపోయే పొగమంచు పైకి లేచి, మబ్బుగా కూడి తిరిగి వానలా కిందికి వస్తుంది.

నేను కూడా మంచులాంటి వాడినే.

చలనం లేని రాత్రిళ్లలో నేను మీ బజారులలో నడిచాను. నా ఆత్మ మీ ఇళ్లల్లో ప్రవేశించింది.

మీ గుండె చప్పుళ్లు నా గుండెలో ఉన్నాయి, మీ ఊపిరి నా ముఖం మీద ఉంది. మీరంతా నాకు ఎరుక అయ్యారు.

అవును, నాకు మీ సంతోషాలు తెలుసు, మీ బాధలు తెలుసు. నిద్రలో మీ కలలు నా కలలయ్యాయి. కొండల మధ్య సరస్సు మాదిరి తరచు నేను మీ మధ్య ఉన్నాను.

మీ శిఖరాలు, మెలికలు తిరిగిన కొండవాలులు, మందల

మాదిరి వెళ్లిపోయే మీ ఆలోచనలు, కోరికలు నాలో ప్రతిబింబిస్తాయి.

నా నిశ్శబ్దంలోకి మీ పిల్లల నవ్వులు వాగులలాగా, మీ యువత కోరికలు నదులలాగా వచ్చి చేరాయి.

నా లోతులలోకి చేరిన తరవాత కూడా వాగులు, నదులు పాడటం ఆపలేదు.

నవ్వులకంటే తియ్యనిదీ, కోరికకంటే విశాలమైనదీ వచ్చి నాలో చేరింది.

అది మీలోని పరిధులు లేనిది:

ఆ విశాల మనీషిలో మీరందరు కణాలు, మూలుగులు మాత్రమే;

అతడి ఉచ్చారణలో మీ పాటలన్నీ శబ్దంలేని ప్రకంపనాలు మాత్రమే.

ఆ విశాల మనీషిలో మీరు విశాలులు,

అతడిని ఆరాధించినట్లే నేను మిమ్మల్ని ఆరాధించి, ప్రేమించాను.

ఆ విశాల పరిధిలో లేని ఏ దూరాలకు ప్రేమ చేరుకోగలదు?

ఏ దృశ్యాలు, ఏ ఆశలు, ఏ అంచనాలు దానిని మించి పైకి ఎగరగలవు?

పూతతో కప్పబడిన పెద్ద ఓక్ చెట్టు మాదిరి ఆ విశాల మనీషి మీలో ఉంటాడు.

అతడి శక్తి మిమ్మల్ని భూమికి బంధించి ఉంచుతుంది, అతడి సువాసన మిమ్మల్ని అంతరిక్షంలోకి లేపుతుంది, అతడిలో మీకు మరణం లేదు.

గొలుసులో మాదిరి మీలో అత్యంత బలహీనమైన లంకె అంత బలహీనులట మీరు.

ఇది సగం సత్యం మాత్రమే. మీరు అత్యంత బలమైన లంకె అంత బలవంతులు కూడా.

మిమ్మల్ని మీ అత్యంత చిన్న పనితో కొలవటమంటే సముద్ర శక్తిని దాని నురగతో అంచనా వేయటం లాగా ఉంటుంది. మీ వైఫల్యాలను బట్టి మిమ్మల్ని నిర్ణయించటమంటే ఒకే రకంగా ఉండనందుకు కాలాలను తప్పుబట్టటం లాగా ఉంటుంది.

అవును, మీరు సముద్రంలాంటి వారు,

మీ తీరాలలో బరువైన ఓడలు అలల కోసం ఎదురు చూస్తున్నప్పటికీ సముద్రం లాగానే మీరు మీ అలలను వేగిరపరచలేరు.

మీరు కాలాలలాంటి వారు కూడా,

మీ శీతాకాలంలో వసంతాన్ని తిరస్కరించినప్పటికీ,
మీలో దాగి ఉన్న వసంతం నిద్దురమత్తులో నవ్వుతుందే కానీ కోపం తెచ్చుకోదు.

"అతడు మనల్ని బాగా పొగిడాడు. మనలో మంచిని మాత్రమే చూశాడు," అని ఒకరితో ఒకరు చెప్పుకోటానికి నేను ఈ మాటలు మీతో అనటం లేదు.

మీకు ఆలోచనల్లో తెలిసిన వాటినే మాటల్లో చెబుతున్నాను.
మాటల్లోని జ్ఞానం మాటలు లేని జ్ఞానానికి నీడ కాక మరేమిటి?
పుడమికి తనూ తెలియని, మనమూ తెలియని పురాతన రోజుల,
పుడమి గందరగోళంలో తలకిందులయిన పురాతన రాత్రుల,
మన నిన్నల వివరాలను భద్రపరిచిన జ్ఞాపకాల అలలే మీ ఆలోచనలు, నా మాటలు.

విజ్ఞులు తమ విజ్ఞతను ఇవ్వడానికి మీ వద్దకు వచ్చారు. మీ విజ్ఞతను తీసుకోటానికి నేను వచ్చాను:
అయితే విజ్ఞతను మించిన దానిని మీ దగ్గర కనుగొన్నాను.
అది మీలోని మండుతున్న ఆత్మ, అది నిరంతరం పెరుగుతూ ఉంటుంది, అది పెరుగుతుండటాన్ని విస్మరించిన మీరు మాత్రం మీ రోజులు తరిగిపోతున్నాయని ఏడుస్తూ ఉంటారు.

సమాధికి భయపడే శరీరంలోని జీవన పిపాసలాంటి జీవితమది.

ఇక్కడ సమాధులు లేవు.

ఈ కొండలు, ఈ మైదానాలు ఉయ్యాలల వంటివి, మొదటి మెట్టు వంటివి.

మీ పూర్వీకులను పాతిపెట్టిన పొలాల పక్కగా వెళుతున్నప్పుడు జాగ్రత్తగా చూడండి: మీరు, మీ పిల్లలు చేయి చేయి పట్టుకుని నాట్యమాడుతుండటం కనపడుతుంది.

నిజానికి మీరు తరచు తెలియకుండానే సంబరాలు చేసుకుంటూ ఉంటారు.

ఇతరులు మీ వద్దకు వచ్చి మీ నమ్మకాలకు బంగారపు మాట ఇచ్చిన మీదట వారికి సంపదలు, అధికారం, కీర్తి కట్టబెట్టారు.

నేను అటువంటి మాట ఏమీ మీకివ్వలేదు, అయినా మీరంతకంటే ఎంతో ఎక్కువ ఇచ్చారు.

జీవితంపట్ల అంతులేని తృష్ణను నాకు ఇచ్చారు.

తమ లక్ష్యాలన్నింటినీ దప్పికగొన్న పెదవులుగాను, తమ

జీవితమంతటినీ జలపాతంగాను మార్చే బహుమతికి మించినది మరొకటి మనిషికి లేదు.

ఇందులోనే నా గౌరవమూ, నా ప్రతిఫలం ఉన్నాయి.

ఈ జలపాతం వద్ద నేను నా దాహం తీర్చుకోటానికి వచ్చిన ప్రతిసారి జీవమున్న ఈ నీరే దప్పికగొని ఉన్నట్టు నేను కనుగొన్నాను;

దానిని నేను తాగుతుంటే అది నన్ను తాగుతోంది.

మీరు ఇచ్చే బహుమతులు పుచ్చుకోలేనంత గర్వినని, సిగ్గరినని మీలో కొంతమంది భావించారు.

బహుమతులు కాదుకానీ, వేతనం తీసుకోనటువంటి గర్వినే నేను.

మీతోపాటు భోజనానికి నన్ను ఆహ్వానించినప్పటికీ నేను కొండలలోని పళ్లు తింటూ గడిపాను,

మీరు సంతోషంగా నాకు ఆశ్రయం ఇవ్వటానికి సిద్ధపడినప్పటికీ నేను గుడి ప్రాంగణంలో నిద్రపోయాను;

అయితే నా పగళ్లు, రాత్రుళ్లపట్ల మీరు కనబరిచిన ప్రేమపూర్వక శ్రద్ధే నా ఆహారాన్ని తియ్యన చేసింది, నా నిద్దురను కలలతో చుట్టివేసింది.

మీరు ఇస్తున్నారని తెలియకుండానే ఎంతో ఇస్తారు,
దీనికి నేను మిమ్మల్ని ఎంతగానో దీవిస్తున్నాను.
తనను తాను అద్దంలో చూసుకునే దయ నిజానికి రాయిలాగా మారిపోతుంది,
సుతిమెత్తని పేరులతో పిలుచుకునే మంచిపనులు శాపంగా మారతాయి.

నేను అంటీముట్టనట్టు ఉంటానని, ఒంటరితనం తాగి ఉన్మత్తుడనయ్యానని మీలో కొంతమంది అంటారు.
"అతడు అడవిలో చెట్లతో సమావేశం అవుతాడుకానీ మనుషులతో కాడు.
"అతడు ఒంటరిగా కొండ శిఖరాల మీద కూర్చుని మన నగరాన్ని చిన్న చూపు చూస్తుంటాడు," అని మీరన్నారు.
నేను కొండలను ఎక్కినదీ, దూర ప్రాంతాలలో ఒంటరిగా తిరిగినదీ నిజమే.
ఎంతో దూరం నుంచి, ఎంతో ఎత్తునుంచి తప్ప నేను మిమ్మల్ని ఎలా చూడగలను?
ఎంతో దూరమైతేతప్ప చేరువ కాలేం కదా!

మీలో మరికొందరు మాటలలో కాదు కాని నన్ను పిలిచేవారు. ఇలా అనేవారు:

"అపరిచితుడా, అపరిచితుడా, అందరాని శిఖరాల ప్రేమికుడా! గద్దలు తమ గూళ్లు కట్టుకునే ఎత్తులలో ఉంటావెందుకు?

"అందరానిది కోరుకుంటావెందుకు?

"నీ వలలో ఏ తుపానులను బంధిస్తావు?

"ఆకాశంలో ఏ గాలి పక్షులను వేటాడుతుంటావు?

"రా, వచ్చి మాలో ఒకడివిగా ఉండు.

"కిందికి దిగివచ్చి నీ ఆకలిని మా రొట్టెతో తీర్చుకో, నీ దప్పికను మా మద్యంతో తీర్చుకో."

వారి ఆత్మల ఒంటరితనంలో ఈ విషయాలు చెప్పారు.

వారి ఒంటరితనం మరింత లోతుగా ఉంటే మీ సంతోషాలు, బాధల రహస్యాన్ని వెతుకులాడుతున్నానన్న విషయం వారికి తెలిసేది.

ఆకాశంలో నడిచే మీ విశాల రూపాలనే నేను వేటాడాను.

కానీ వేటగాడే వేటాడబడిన వాడు కూడా అయ్యాడు:

నా విల్లుని వదిలి వెళ్లిన బాణాలలో అనేకం నా రొమ్ములోనే నాటుకున్నాయి.

ఎగురుతున్నవాడే పాకుతున్న వాడు కూడా అయ్యాడు:
ఎండలో పరుచుకున్న నా రెక్కల నీడ నేలపై తాబేలులాగా పాకుతుంది.

నేను నమ్మినవాడినే అయినప్పటికీ సందేహించినవాడిని కూడా అయ్యాను;
మీలో మరింత నమ్మకం కలిగేలా, మీ గురించి మరింత తెలివిడి కలిగేలా నేను తరచు నా గాయాలను రేపేవాడిని.

ఈ నమ్మకం, ఈ తెలివిడితోనే చెబుతున్నాను:
మీరు మీ శరీరాలలో బంధింపబడిలేరు, మీ ఇళ్లకు, పొలాలకు పరిమితమై లేరు.

నువ్వు అనబడేది కొండలపై నివశిస్తూ గాలిలో సంచరిస్తూ ఉంటుంది.

అది వెచ్చదనంకోసం ఎండలోకి పాకేదీ కాదు, భద్రతకోసం చీకటిలోకి కన్నాలు తవ్వేదీ కాదు,
అది స్వేచ్ఛా వస్తువు, పుడమిని ఆవరించిన ఆత్మ.

ఈ మాటలు అస్పష్టంగా ఉంటే వాటిని స్పష్టపరిచే ప్రయత్నం చేయవద్దు.

అన్నింటి ఆరంభం - అంతం కాదు - అస్పష్టంగా, మాయగా ఉంటుంది.

నన్ను ఆరంభంగానే గుర్తుంచు కోవాలని నేను కోరు కుంటున్నాను.

జీవితం, జీవం ఉన్న సమస్తం మంచులో రూపుదిద్దు కుంటుంది కాని స్ఫటికంలో కాదు.

స్ఫటికం అన్నది కుళ్లిపోతున్న మంచేమో, ఎవరికి తెలుసు?

నన్ను గుర్తుచేసుకున్నప్పుడు ఈ విషయాలు మీకు గుర్తుకు రావాలని నేను కోరుకుంటున్నాను:

మీలో అత్యంత బలహీనమైనదని, అత్యంత గందరగోళమని అనిపించేదే అత్యంత బలమైనదీ, అత్యంత దృఢచిత్తం కలదీ.

మీ ఎముకలను నిలబెట్టి, గట్టిపరిచింది మీ ఊపిరి కాదా?

మీ నగరాన్ని, అందులో మీరు ఏర్పరచుకున్న ప్రతిదానిని నిర్మించింది మీరందరూ మరిచిపోయిన కల కాదా?

ఆ ఊపిరి అలలు మీరు చూడగలిగినట్లయితే మీ కంటికి ఇంకేమీ కనపడదు,

ఆ కలల గుసగుసలు వినగలిగితే మీ చెవికి ఇంకే శబ్దాలు వినపడవు.

మీరు దానిని చూడలేకపోతున్నా, వాటిని వినలేకపోతున్నా కంగారు పడవలసింది ఏమీ లేదు.

మీ కళ్లను కప్పి ఉంచిన ముసుగును అల్లిన చేతులే దానిని తొలగిస్తాయి,

మీ చెవులలో మట్టిని నింపిన చేతులే దానిని ఛేదిస్తాయి.

అప్పుడు మీరు చూడగలుగుతారు,

అప్పుడు మీరు వినగలుగుతారు,

అయినప్పటికీ మీరు ఇంతకాలం గుడ్డివారిగా ఉన్నందుకు తిట్టుకోరు, చెవిటి వారిగా ఉన్నందుకు బాధపడరు.

ఆ రోజు మీరు అన్ని విషయాల వెనక దాగిఉన్న ఉద్దేశాలను గ్రహిస్తారు.

అప్పుడు మీరు వెలుతురును దీవించినట్లే చీకటిని కూడా దీవిస్తారు.

ఇలా చెప్పి అతడు చుట్టూ పరికించి చూశాడు.

ఓడ కప్తాను ఒకసారి పూర్తిగా ఎత్తిఉన్న తెరచాపల వంక, ఒకసారి దూరం వంక చూస్తూ ఉండటం అతడి కంట పడింది.

అతడు ఇలా అన్నాడు:

నా ఓడ కప్తాను శాంతిపరుడు, ఎంతో శాంతిపరుడు.

గాలి వీస్తోంది, తెరచాపలు తహతహలాడుతున్నాయి;
చుక్కాని కూడా దారి చూపమని అడుగుతోంది;
అయినా నా మౌనాన్ని కప్తాను మాటాడకుండా ఎదురు చూస్తున్నాడు.
మహాసముద్రపు బృందగానం విన్న నా తోటి నావికులు కూడా నేను చెప్పేది ఓపికగా విన్నారు.
ఇప్పుడిక వాళ్లు వేచి ఉండవలసిన పనిలేదు.
నేను సిద్ధంగా ఉన్నాను.
వాగు సముద్రాన్ని చేరుకుంది, అమ్మలగన్నయమ్మ తిరిగి తన బిడ్డను రొమ్ముకు హత్తుకుంది.

ఓ ఆర్ఫలీస్ ప్రజలారా! మీకిదే నా వీడ్కోలు.
ఈ రోజు ముగిసింది.
రేపటి కోసం నీటికలువ రేకులు ముడుచుకున్నట్లు అది ముగుస్తోంది.
ఇక్కడ మనకు దొరికినదానిని మనం ఉంచుకుందాం,
ఇది చాలకపోతే మళ్లీ మనం ఇక్కడ జమగూడి ఇచ్చేవాడిని అర్థిస్తూ కలిసి చేతులు చాచుదాం.
నేను మళ్లీ మీ దగ్గరకు వస్తానన్నది మరిచిపోవద్దు.

మరికొంత సమయంలో నా కోరిక మరో శరీరానికి దుమ్మునీ, నురగనీ పోగుచేసుకుంటూ ఉంటుంది.

ఒక క్షణకాలం గాలిమీద విశ్రమించిన తరవాత మరో మహిళ నన్ను గర్భంలో ధరిస్తుంది.

మీకూ, మీతో గడిపిన యవ్వనానికీ వీడ్కోలు.

మనం నిన్ననే కలలో కలిసినట్లు ఉంది.

నా ఒంటరితనంలో మీరు నాకు పాటలు వినిపించారు, మీ కోరికలతో ఆకాశంలో పెద్ద మేడ కట్టాను.

ఇప్పుడు మన నిద్దుర వీడింది, కల చెదిరింది, ఇప్పుడిక తొలిపొద్దు కాదు.

ఇప్పుడు మలిపొద్దు, మన సగం మెలకువ ఒక రోజు పూర్తిచేసింది, మనం విడిపోవాలి.

జ్ఞాపకాల సంధ్యలలో మళ్లీ కలిస్తే మళ్లీ మాట్లాడుకుందాం, అప్పుడు మీరు నాకు మరింత లోతైన పాట వినిపిస్తారు.

మరో కలలో మన చేతులు మళ్లీ కలిస్తే ఆకాశంలో మరో మేడ కడదాం.

ఇలా అంటూ అతడు నావికులకు సంకేతం ఇచ్చాడు. వాళ్లు వెంటనే లంగరెత్తారు, బంధాల నుండి విడివడిన ఓడ తూర్పు దిశగా కదిలింది.

ఒకే హృదయంలోంచి వెలువడినట్లు ఆ ప్రజలందరి నుండి ఒక కేక వెలువడింది. అది సంధ్య చీకట్లలో పైకెగసి సముద్రం మీద పెద్ద ఘీంకారం మాదిరి వినపడింది.

మంచుతెరలో ఓడ కనుమరుగయ్యేవరకు చూస్తూ నిశ్శబ్దంగా ఉండిపోయింది అల్‌మిత్ర.

మిగిలిన ప్రజలందరూ వెళ్లిపోయినప్పటికీ ఆమె ఒక్కతే సముద్రపు గోడ దగ్గర నిలబడి అతడి మాటలను గుండెలలో గుర్తుచేసుకుంటూ ఉండిపోయింది:

"ఒక క్షణకాలం గాలిమీద విశ్రమించిన తరవాత మరో మహిళ నన్ను గర్భంలో ధరిస్తుంది."

# ఖలీల్ గిబ్రాన్

**1883-1931**

కవి, తత్వవేత్త, కళాకారుడైన గిబ్రాన్ లెబనాన్‌లో పుట్టాడు.

గిబ్రాన్ రాసిన ఈ అద్భుత పుస్తకం గత శతాబ్దంలో ఎందరో అభిమానాన్ని చూరగొంది. 1923లో మొదట ప్రచురితమయిన ఈ పుస్తకం ఇప్పటివరకు 40కి పైగా భాషలలోకి అనువాదం అయ్యింది. లక్షలాది ప్రతులు అమ్ముడుపోయాయి. తెలుగులోనే ఇప్పటివరకు నాలుగు అనువాదాలు ప్రచురితమయ్యాయి.

ప్రతి మనిషి జీవితంలోని అనేక మౌలిక అంశాల గురించి 'ప్రవక్త' మాట్లాడాడు: ప్రేమ, ఇవ్వటం, ఆహారం, పని, సంతోషం, దుఃఖం, పిల్లలు, బట్టలు, ఇళ్లు, అమ్మటం - కొనటం, నేరమూ - శిక్ష, స్వేచ్ఛ, హేతువూ - కాంక్ష, ఆత్మజ్ఞానం, స్నేహం, ప్రార్థన, ఆనందం, అందం, మతం, మరణం ... ఇవన్నీ ప్రతి ఒక్కరికీ సంబంధించినవే.

తను రాసిన వాటిల్లోకెల్లా 'ప్రవక్త' గొప్పదిగా గిబ్రాన్ భావించాడు. గిబ్రాన్ మాటలలో: "లెబనాన్ కొండలలో ఉన్నప్పుడు ఈ పుస్తకం రూపుదిద్దుకున్న తొలిసారి నుంచి అది నా వద్ద ఎప్పుడూ ఉండేది. అది నాలో ఒక భాగం అయిపోయినట్లు ఉండేది .... దీనిని ప్రచురణకర్తకు ఇచ్చేముందు నాలుగు సంవత్సరాలు నాతోపాటు ఉంచుకున్నాను. ప్రతి ఒక్క మాట నేను రాయగలిగినదాంట్లో అత్యుత్తమమైనదిగా నిర్ధారించుకున్న తరవాతే దానిని ప్రచురణకు ఇచ్చాను."

మంచి పుస్తకం

ISBN 978-93-80153-54-4